ఆంధ్రభూమి

సంపుట : ౧౦. చిత్రభాను, శ్రావణము : జూలై, 1942. సంచిక : ౯.

# సంపాదకీయ సమాలోచన

మహాత్ముని విజయ శంఖా నాదం.

గాంధీమహాత్ముడు మరల నాలుగోసారి తన విజయం శంఖమును పూరిస్తున్నాడు. ఆధ్వని ఆశేతు హిమాచలపర్యంతము సంచలనం కలిగిస్తోంది. సేవాగ్రామనందు ప్రతిధ్వనిస్తోంది. స్వతంత్ర పోరాటమునకు అహింసాతత్వ కవచమును ధరించి మహాత్ముడు రణరంగమున దిగిననాడు భారతావనిలో ఎవరు వెనుతీయుదురు ! మహాత్ముని అనుజ్ఞ అయిననాడు భారత దేశంలో జాతిమత విబేధములు, లేకండా విజయవాంఛతో అతని వెనువెంట నడుచుటకు భారతీయయువకులు వేనవేలు సంసిద్ధముగా వున్నారు.

ప్రభుత్వ యుద్ధప్రయత్నములకు ఎట్టి యిబ్బంది కలిగింపనని ఆశీర్వదించిన మహాత్ముడు తన పూర్వ విశ్వాసమును ఉపసంహరించుకొని యిప్పుడు బ్రిటిష్ ప్రభుత్వము భారత దేశమునుండి వెంటనే తమ అధికారమును ఉపసంహరించుకోవలెనని అనుట చాలా మందికి విపరీతముగా వుండవచ్చు.

మహాత్ముని అభిప్రాయం మారడానికి కారణము ముఖ్యంగా బ్రిటిష్ ప్రభుత్వపు ఆస్తికలకు పట్టిన సామ్రాజ్యతత్వమే అదిచాలా శోచనీయమైన విషయం.

ఏ మహత్తరశక్తి రక్షణకొరకు మిత్రమండలి పోరాడుచున్నదో అట్టి శక్తిని బ్రిటిషి ప్రభుత్వము భారత దేశానికినిరాకరించడం చాలా విచారకరమైన విషయం.

మిత్రమండలి అట్లాంటిక్ చార్టరును ఒక దానిని ప్రకటించింది. అది భారత దేశానికి వర్తింపదన్నారు. క్రిప్సు రాయబారిగా వచ్చి భారతీయులను నిరాశా సముద్రమున పడద్రోసి చక్కా వెళ్ళాడు.

రూజువెల్టు రాయబారి కల్నల్ జాన్సన్ యిండియా పరిస్థితులు పరికించి వెళ్ళి మిన్నకున్నాడు.

బ్రిటిష్ ప్రభుత్వము, మిత్రమండలి యిన్నివిధముల భారతీయులయెడ అలసభావం చూపిస్తూ తమజాత్యాధికతను చూపించుటవల్ల మహాత్ముడు ఉద్రిక్తుడైనాడు.

అలుగుటయే ఎరుగని మహాత్మునికి అలుకకలిగింది. కాగా తన సానుభూతిని చూపుతూ వచ్చిన బ్రిటిష్ ప్రభుత్వమునెడ అభిప్రాయమును మార్చుకొన్నాడు.

మార్చుకొనుటే కాదు శాంతియుతంగా ప్రభుత్వముతో పోరాడటానికి నిశ్చయించుకొన్నాడు. సత్యాగ్రహం చేయడానికి ఆయత్తం చేస్తున్నాడు.

ముందు చేయబోవు కార్యక్రమమును ఒక తీర్మాన రూపంగా వార్ధాలో సమావేశమైన వర్కింగు కమిటీముందు పెట్టినాడు. కొద్దిపాటి మార్పులతో ఆతీర్మానం ఆమోదింపబడినది. ఆ తీర్మానం ఆమోదించడమంటే, ప్రభుత్వ యుద్ధ ప్రయత్నాలకు అంతరాయాలు రావచ్చు. దానికి ప్రభుత్వం తీవ్రచర్యలు తీసుకొనవచ్చు. అంటే హిందూ దేశము

లోని రాజభక్తులకు దేశభక్తులకు మరల యింకొక సారి తీవ్రమైన శాంతిసమరమన్నమాట. ఈ తీర్మానములను అఖిలభారత కాంగ్రెసు సంఘముకూడా చర్చించుటకు ఆగస్టు మొదటివారములో బొంబాయిన నగరంలో సమావేశమగుచున్నది. ఆసంఘము కూడా మహాత్ముని నాయకత్వముపై పూర్ణవిశ్వాసమును ప్రకటిస్తూ ఆతీర్మానమును ఆమోదింస్తారని విశ్వసింపవచ్చును.

ఈ క్లిష్టపరిస్థితులలో మహాత్ముడు యిట్టి తీవ్ర సత్యాగ్రహం చేయడానికిసిద్ధంకావడం అతి సాహసమేయగును కాని మహాత్ముడు తాను చేయబోవు సత్యాగ్రహ కార్యక్రమము మిత్రమండలి ప్రతినిధులందరికి శృతపరచి మరీ ప్రారంభిస్తాడని ఒక వదంతి వుంది. అది నిజంగా ఆనందకరమైన విషయం. ఇప్పటికైనా మిత్రమండలి ప్రతినిధులు రూజువెల్టు, స్టాలిన్, చియాంగకై షేక్ మొదలగువారు కలుగచేసుకొని భారతీయుల చిరవాంఛితమును సమకూర్చి మిత్రమండలి యుద్ధప్రయత్నాలకు అంతరాయములు రానీయకుండా చేసుకొనేబాధ్యత వారిపైన వున్నది, అట్లు జరిగిననాడు మిత్రమండలికి సంపూర్ణ విజయం చేకూరును. భారతీయుల సహకారమును నిరాకరించడం అసహాయోద్యమము చేయుటకు ప్రోత్సహించడం వంటిదే. అది జపాను కిదోసందు.

మహాత్ముడు తన జీవితాశయమును సిద్ధింపజేసుకొనుట ఎట్టి క్లిష్ట పరిస్థితులు ఏర్పడినా వెనుతీయడు. అతని అంతరాత్మ ఎప్పుడు ప్రేరేపించునో అప్పుడు తన కార్యక్రమమును ప్రారంభిస్తూ వచ్చాడు. ఈ క్లిష్ట పరిస్థితులలోకూడా మహాత్ముడు ఈ అసహాయోద్యమం తలపెట్టుట అతని అంతరాత్మ ప్రేరణే అయి వుండాలి.

కాంగ్రెసు అవలంభించిన పద్ధతికి బ్రిటిష్ పత్రికలు తీవ్రంగా విమర్శించాయి. కాని ఫిషర్ మొదలగు అమెరికా పత్రికావిలేఖరులు, ప్రముఖులు ఏదో సామరస్యము చేకూర్చవలెనని విశ్వప్రయత్నములు చేస్తున్నారు. యుద్ధానంతరము భారతీయులకు స్వతంత్రత యిస్తామని అమెరికా గారంటీయిస్తే యిప్పుడు మీరు వూరుకుంటారా అని ఒక అమెరికా విలేఖరి పండిత నెహురూని ప్రశ్నించాడు. క్రియారూపం దాల్చని ప్రకటనలతో తృప్తిపడరని. సంపూర్ణ స్వతంత్రమును తప్ప మరేమీ భారతీయులకు అంగీకారముకాదనిఇప్పటికైన మిత్రమండలి ప్రభుత్వములు గుర్తెరింగి వ్యవహరించడం చాలామంచిది. స్వతంత్ర సంపాదనకై భారతీయులు తమ సర్వస్వమును ధారపోయ సంసిద్ధముగానున్నారు భారతదేశమును స్వతంత్ర దేశంగాచేసిననాడు, అంటే ప్రభుత్వమునుభారతీయులవశం చేసిననాడు భారతీయులు శక్తివంచనలేకండా మిత్రమండలికి విజయం సమకూరుస్తారు. కాని భారతీయుల వాంచితమును నిరాకరించిననాడు మహాత్ముని నాయకత్వం క్రింద భారతీయ స్వాతంత్ర సమరము ప్రారంభింపక తప్పదు. అట్టి క్లిష్టపరిస్థితులకు భారతదేశమును లోను చేయకుండా బ్రిటిష్ రాజకీయవేత్తలుభారతీయ సమస్యనుసరళంగా సానుకూలం చేస్తారని విశ్వసిస్తున్నాము.

**రాజాజీ పతనము**

అవి మహాత్ముడు కమ్యూనల్ ఎవార్డుకు ప్రతిఘటిస్తూ పూనాజైలులో నిరసనవ్రతం స్వీకరించిన శుభదినాలు. మన రాజాజీ ఆసమయంలో గాంధీని నిరసన వ్రతమును విరమింపమని ప్రాధేయపడ్డాడు దేనికై నిరసనవ్రత మవలంబించాడో అది సఫలీకృతం కాకండా విడిచిపెట్టేవాడుకాదు మహాత్ముడు. తన దీక్షకు విఘ్నం కలిగిస్తున్న రాజాజీనిచూస్తే ఆనాడు గాంధీకే ఎళ్లు మండి. "యూ శాటన్ గెట్ అవుట్" అన్నాడని ఒక వదంతి. మహాత్ముడు రాజాజీ పోరు పడలేక ఆమాట అనే వుండవచ్చు. అయినా రాజాజీ గాంధీని వదలలేదు తన కూతురును గాంధీ కుమారునికి ధారపోసి గాంధీతో పరిచయమే కాకండా బంధుత్వంకూడా కలుపుకున్నాడు.

[మిగతా ౨౯౨ లో చూడు.

# గాంధీటోపీతో గవర్నరుగద్దెనలంకరించిన రాఘవేంద్రుడు

రచయిత:

**కాశ్యపి**

ఈద్పుగంటి రాఘవేంద్రరావు తెలుగుతల్లి ముద్దుబిడ్డలలో అగ్రగణ్యుడు. రాష్ట్రేతరాంధ్రులలో అసదృశ ప్రతిభాశాలి. ప్రజారంజకుడగు నాయకుడు. రాజకీయ దురంధరుడు. గాంధీటోపీతో గవర్నరుగద్దెనెక్కిన శూరుడు. రాఘవేంద్రరావుని రాఘవేంద్రుడు అనుట అతిశయోక్తి కానేరదు. ఖండ ఖండాంతరములందుకూడా ఖ్యాతి గాంచిన తెలుగుబిడ్డడు. ఇతడు గత నెల 15–వ తేదీ మధ్యాహ్నము ఢిల్లీనగరంలో పరమపదించాడు. అతని మరణముతో తెలుగుతల్లికి తీరనిలోపం కలిగింది. ఆమేధావి సేవవల్ల తను ఏదో కొండ ఎక్కాలనుకుంది ఆమె ఆశలన్నీ నిరాశలైనవి.

ఆ ధన్యజీవి కృష్ణాజిల్లాలో పెద్ద మద్దాల గ్రామంలో 1890 లో ప్రభవించాడు. అతని బాల్యదశలోనే వారి కుటుంబము మధ్యపరగణాలలోని బిలాసపూరునకు వలసపోయింది. రాఘవేంద్రుని బాల్యదశ అంతయు బిలాసపూరులోనే జరిగింది. అక్కడ విద్యాభ్యాసం పూర్తికాగానే ఇంగ్లాడు వెళ్ళి బారిస్టరుపరీక్షలో ఉత్తీర్ణుడై తిరిగి యిండియాకు వచ్చాడు. అతడు బిలాసపూరునందే తనప్రాక్టీసు ప్రారంభించాడు. మహాత్ముని శంఖారవము వినపడగానే ప్రాక్టీసును త్యజించి దేశసేవకై తన జీవితమును అంకితంచేసిన నాయకుడు, రాజకీయంగా వెనుకబడివున్న మధ్య మాగాణములనుపైకి తీసుకువచ్చిన ప్రజ్ఞాశాలి.

1919 లో జూలైమాసంలో కలకత్తాలో జరిగిన అఖిలభారత కాంగ్రెసు సంఘసమావేశమునకు హాజరైనాడు ఆ సమయంలో అమృతసరులోని ప్రజల దుస్థితినెరిగి సహాయంచేయడానికి 1200 రూపాయలు చందాను యిచ్చిన దానకర్ణుడు.

1920–1921 లోజరిగిన సత్యాగ్రహసమయం బొంబాయి మెయిలు భూసావలునుండి బయలుదేరింది. అతడు యింటరులో ఎక్కాడు. అతని పెట్టెలో ఎనమండుగురు ఎక్కవలసినది 16 గురు ఎక్కారు కాగా తన పెట్టెలో ఎక్కిన అధిక సనఖ్యాకులను దింపేవరకూ రైలుబద్దెల కడ్డంగా నిలచి బండిని పోనీయని పట్టుదలమనిషి అతని పట్టు భల్లూకపుపట్టువంటిదే. అట్టి పట్టుదలగలమనిషి కాంగ్రెసు కార్యక్రమంతో తృప్తిపడక ప్రభుత్వమును ప్రతిఘటించుటవల్ల ప్రజలకు తగిన సేవ చేయలేక పోతున్నానని పరితపించి తన తత్వమును మార్చుకొన్న మహనీయుడు.

దాసుపార్టీలో చేరి 1924 లో ఎసెంబ్లీ ఎన్నికలకునిలచి మధ్యపరగణాల ఎసంబ్లీ సభ్యుడైనాడు. మధ్య మాగాణాలలోని స్వరాజ్య పార్టీకి నాయకశిఖామణి అయినాడు. కాంగ్రెసుదృష్టిలో అతని దేశసేవ కుంటుపడినది కాని ప్రజలలో అతనిసేవా పరాయణత మిన్నుముట్టినది. ప్రభుత్వముతో ఏకీభవించి మధ్య మాగాణాలలో మంత్రిత్వము స్వీకరించినా కాంగ్రెసు టోపీనిమాత్రం విసర్జించలేదు. ఖద్దరుతప్ప యితర దుస్తులు ఎన్నడూ ధరింపలేదు. అతని దేశాభిమానం అద్వితీయమైనది.

1930 లో అతడు హోమ్ మెంబరుపదవి నలంకరించాడు. 1937 వరకూ అధికారంలో వున్నాడు.

1937 లో జరిగిన ఎన్నికలలో కాంగ్రెసుతో పోటీచేసి అఖండ విజయం పొందాడు. 1936 లో అతడు గవర్నరుగా పనిచేశాడు. అప్పుడుకూడా అతని ఖద్దరుటోపీని మార్చలేదు. ఖద్దరు దుస్తులతో గవర్నరుపదవిని అలంకరించిన భారతీయులలో యితడే ప్రధముడు. ఇంట్రిమ్ ప్రభుత్వములో ప్రధానామాత్యుడుగా పనిచేశాడు.

1939 లో ఇండియా కార్యదర్శి ఎమరీకి సలహాదారుగా నియమితుడైనాడు. ఆ అధికారమును స్వీకరించుటకు యింగ్లాండు వెళ్లుటకు పూర్వం మదరాసు విచ్చేసియున్నాడు. ఆసమయమున మదరాసులోని ఆంధ్రమహాసభ అతనికి అఖండ స్వాగతము యిచ్చింది. ఒక విందుకూడా చేసింది. ఆ సందర్భంలో ఉపన్యసిస్తూ తాను యింగ్లాండు వెళ్ళిన వెనుక ఆంధ్రరాష్ట్ర సిద్ధికై తను శక్తివంచన లేకండా పనిచేస్తానని వాగ్దానం చేసియున్నాడు. అతడు తనలోపం లేకండా ప్రయత్నించాడు. ఏదో భూతమొకటి ఆంధ్రరాష్ట్ర విభజన విషయంలో తనబుద్ధి చూపెట్టుతున్న విషయం బయటపెట్టిన మహనీయుడితడే.

ఆంధ్రరాష్ట్రము ఫలింపకండా యితడు దివంగతుడగుట ఆంధ్రుల దురదృష్టమే.

ఇతడు యింగ్లాండులోవున్న సమయములో దేశరక్షణ విధానాన్నిగురించి బాగా పరిశోధించాడు. దానిమీదనున్న గ్రంథరాజములనన్నింటిని క్షుణ్ణంగా చదివాడు. బాగా అతన్ని వైస్రాయి కౌన్సెలులో సివిల్ డిఫెన్సు కార్యదర్శిగా నియమించారు.

రాఘవేంద్రుడు ఇంగ్లాండులోవున్న సమయంలో తగిన ఆహారం దొరకకపోవడంవల్లను ఆరోగ్యం చెడింది. ఇండియాకు తిరిగి వచ్చిన వెనుక బలహీనత అధికమయింది. తన పదవికి రాజీనామా యిచ్చి విశ్రాంతికోరకు బిలాసాపూరు వెళ్లాలనుకొన్నాడు. రాజీనామా యిచ్చాడు. కాని బిలాసాపూరు వెళ్ళకండానే ఆబలహీనతే అతని పాలిటి మృత్యుదేవత మన పాలిటి నిర్భాగ్యదేవత అయింది.

ఉన్నత ఉద్యోగాలు అలంకరించినా జాతీయత దేశాభిమానము విడువని నాయకరత్నము ఒక్క రాఘవేంద్రుడే. అన్నివిధాలా అధోగతిలోవున్న తెలుగువారికి అతని జీవితజ్యోతి ఒక ఆదర్శమైనది అనుట అతిశయోక్తి కానేరదు. ఆ మహనీయుని త్రివర్ణతైల చిత్రపటము నొకదానిని నెలకొల్పుటకు చెన్నపురి ఆంధ్ర మహాసభవారు పూనుకొనుట కడుంగడు ముదావహమైన విషయం వారి సత్సంకల్పమునకు భగవంతుడుకూడా తోడ్పడి ఆంధ్రనాయకుని కీర్తి చిరస్థాయి చేయుగాకయని కోరుచున్నాము.

---

[3౯౦-వ పేజీ తరువాయి.]

దానితో రాజాజీ ప్రతిభ మిన్నుముట్టింది. అఖిల భారత రాజకీయాల్లో గొప్ప పలుకుబడి సంపాదించాడు. ఇదిఅంతా అతని బంధుత్వ ప్రభావముకాని వేరుగాదు. ఏశక్తివల్ల తను యింతవాడైనాడో తుదకు ఆశక్తితోనే అతడు ఢీకొన్నాడు. రాజాజీస్థితి పరికిస్తే భస్మాసురుని చరిత్ర జ్ఞాపకంవస్తోంది. అట్లా రాజాజీకి రాజకీయాల్లో నక్కచావు అయిందన్న మాట. ఇటు కాంగ్రెసుతో విరోధంపెట్టుకుని అటు జిన్నాసాహెబుని తృప్తిపరచలేక మధ్యను త్రిశంకు స్వర్గంలో వూగులాడుతున్నాడు. రాచపీనుగ వంటరిగా చావదన్నట్టు తనవెనుక దక్షిణదేశంలో నాయకుడవుతాడన్న భయంచేత సాంబుని ముందుగానే సంచీలో వేసుకొన్నాడు. మొత్తంమీద అతడు దక్షిణదేశపు కాంగ్రెసు నాయకత్వమునుండి తొలగింపబడటం ఆంధ్రులకు ముదావహమైన విషయం. ఆంధ్రరాష్ట్రసిద్ధికి సైంధవంలా అడ్డుతగిలి ఆంధ్రులకు శతకోపములు పెడుతూ వచ్చిన శ్రీవైష్ణవుడు పెడతొలగి వుండడం ఆంధ్రులను ఆవరించిన వైష్ణవ మాయ అంతరించడ మన్నమాట.

# కామధేనువు

ప్రకాశంగారి జమీందారిబిల్లువంటి ఇనాం బిల్లుకూడా ఒకటిపుడితేసామాన్యసంసారులుపడే ఇక్కట్లను వూహా ప్రపంచములో వూహించి చిత్రించిన ఒక చిన్ని ఘట్టం.

రచయిత :

బులుసు ప్రకాశమ్మ

౧

మా చింతలపాటి పొలం మూడెకరాలూ, మా కుటుంబానికి నిజంగా ఒక కామధేనువే. ఆ పొలం మాకుండడంవల్ల మా ఇంట్లో అందరమూ 'కామధేనువు' ఉంటే, ఉండే ఆనందాన్ని అనుభవపూర్వకంగా తెలుసుకోగలిగాము.

మాది చాలా పండితవంశం, మా ముత్తాత జగత్పండితుడు. ఒకప్పుడు ఆయన యజ్ఞంచేస్తూఉండగా చూడడానికని వచ్చి ఆనందగజపతి మహారాజుగారు చింతలపాటి అగ్రహారం దానపూర్వకంగా ఇచ్చారుట.

పెళ్ళిళ్ళకైతేనేమి, పేరంటాలకైతేనేమి, పోయినదిపోగా ఇప్పటికి మాకు మిగిలినది, ఈ మూడెకరాల భూమిని.

పొయిలోకి మామిడిపేళ్ళూ, ఆవుపాకకి తాటాకూ నారా, వంకాయలూ, బీరకాయలూ, మామిడికాయలూ పళ్ళూ, ఒకటేమిటి? సమస్తమూను. ముంజికాయలు తిన్నన్ని వెంకన్నతాత పంపేవాడు. మా కామధేనువు మమ్మల్ని పోషించడానికి ఏమివ్వదు? అనేది అమ్మ.

ఇంటపుట్టినదూడ, పరువుదక్కించే పాతకొంప. మూడెకరాల మెట్టపొలం, ఇదీ మాకున్న ఆస్థి.

మా నాన్నకి కళ్ళులేవు. గుడ్డివాడు, పూర్తిగా గుడ్డి. నాకు జ్ఞానం తెలిసేటప్పటికే మా నాన్న గుడ్డివాడు. మా అమ్మ నోటి మంచితనం, మర్యాదా, తెలివితేటలవల్లా, సంసారంగుట్టుగా నెట్టుకుపోతోంది.

మా చెల్లెళ్ళిద్దరూ బొత్తిగా చిన్నపిల్లలు. ఐదేళ్ళదొకత్తీ, మూడేళ్ళదొకత్తీను. తమ్ముడు ఎనిమిదేళ్లు వచ్చాయన్నమాటేగాని అమ్మమాట ఒక్కటేనా వినడు. ప్లీడరుగారి అబ్బాయివిలాంటి, పంట్లాలూ, చొక్కాలూ, కావాలంటే. రావని వాడికి తెలియదు. నేను పదేళ్ళదాన్నే ఐనా అమ్మకి చాలా చేదోడు, వాదోడుగా ఉండేదాన్ని. అన్నయ్య పట్నంలో తొమ్మిదోక్లాసు చదువుకుంటున్నాడు. ఎలాగో నాలుగేళ్లు కళ్లు మూసుకుని దొర్లించుకుపోతే, అన్నయ్య ఎక్కడో పదిరాళ్లు తెస్తాడు కష్టాలు గట్టెక్కుతాయి అంటుంది అమ్మ.

మా నాన్న చెయిజాచి ఎవరినీ యాచించడు. ఎఱుగున్నంతమటుకు, ఎవరింట్లో, కార్యకరాలైనా తాంబూలంలో చుట్టి రెండో, మూడో, నాన్నతో మాట్లాడి వెళ్ళేటప్పుడు అక్కడ పెట్టి వెళ్లిపోతారు అంతే! ప్లీడరుగారి కూతురు కడుపుతో ఉందంటే, అమ్మ తోడెట్టిన పెరుగు కావాలి. వారూ అంతే. మీ శారదకి కన్నె తులిసెమ్మ నోమునోస్తామని, పరికిణీ. 'మావాడికి చాలకుండా పుట్టాడు మిమనువాడు' అంటూ తమ్ముడికి పంట్లాలూ, చెల్లెళ్ళకి గౌన్లూ ఇచ్చేవారు.

అమ్మా నేనూ మధ్యాహ్నం ఎంత ఒడికినా వారానికి నాలుగుచిలపలవడం, బ్రహ్మప్రళయమైపోయేది. మాకు బట్టలికి అడపా దడపా ఇబ్బంది కలిగేది గాని అలాగే దుద్దుపెట్టుకుపోయేవాళ్లం.

వెంకన్నతాతా. నాన్నా, కబుర్లకి పడ్డారంటే అటునూర్యు డిటు వాలవలిసిందే, వెంకన్నతాతది పెద్ద గడ్డం. మేమంతా 'గడ్డంతాత,' అనే వాళ్లం అతణ్ణి.

మా చింతలపాటి పొలం మూడెకరాలకీ అతడురైతు. మా అమ్మని అమ్మాయిగారూ అని పిలిచేవాడు. మా ఇంటి గుమ్మాలేవీ అతడికి చాలేవికావు. వొంగి నడిచేవాడు. భారీమనిషి. తన చిన్ననాటి

అలవాట్లూ, పన్లూ, తాత వర్ణించి చెబుతే, తన తాతల పాండిత్యమూ, పొందిన మర్యాదలూ, నాన్న చెప్పే వాడు.

తాతమాటలెప్పుడూ, తను చిన్నప్పుడు పాలేరుగా ఉండడం. కుప్పకి కావలికాయడమూ, నక్కలు రావడమూ, పొలంలో చలీ, వాటిమీద నడిచేవి.

నాన్న పూర్వకాలపువాళ్ళ సంప్రదాయములూ మాటనిలకడా, భక్తీ, ఎత్తేవాడు.

ఇద్దరూ ఆఖరికి, ఈకాలంవాళ్ళ మీద పడేవారు. అర్ధాయుష్కులనీ, అర్థలేని జీవనాలనీ తీర్మానించేవారు వెళ్లేటప్పుడు 'అమ్మాయిగారూ?' అనేవాడు తాత. కూడా నన్ను తాత యింటికి తీసుకువెళ్లేవాడు.ఓబుల్రెడ్డు చిలగడదుంపలో, మామిడిపళ్ళో, వేరుశనక్కాయలో, ఇచ్చి పంపేవాడు. నెలకి పదిహేనురోజులు తాత మా ఇంట్లోనే అన్నంతినేవాడు, అతడు భద్రాది మాడ్డోసారి వెళ్లొచ్చాడు వాళ్లకూరలు తినడం మానేశాడు. శనివారాలూ, ద్వాదశీ వాట్లల్లో ముఖ్యమైనవి. తాత భోజనం చేస్తాననడం నాన్నకి బ్రహ్మానందం. తాతకి ఇష్టమైనవి వేటివేటినో పురమాయించేవాడు. తాతతో మాట్లాడకపోతే నాన్నకి ఉబుసుపోదూ... నాన్నదగ్గిర కూచోకపోతే తాతకి కాలక్షేపంకాదు.

గరికి సన్నాల అన్నం (ఎఱ్ఱగా ఉంటేనేంగాక) మంచి రుచిగా ఉండేది. మాపొలంలో అవే పండుతాయి. తాత పంపేవాడు. మేం తినేవాళ్ళం.

'అన్నయ్యా ఉద్యోగంచేసేటప్పుడు మనంగూడా తెల్లటిఅన్నం తింటాం గాదూ' అనేది చెల్లి,

శిస్తు చెల్లించేపాటేనా వెనకచూపు ఉంచుకో వెంకన్నా ఏ! అనేవాడు నాన్న. అబ్బాయిలికీ, అమ్మాయిలికీ కూడా నోరుకట్టి కడుపు నింపుకోమంటావా? బాబూ! వాకున్న యాభై ఎకరాల మాగాణీ, సోములుగాడి కూటికి చాలక పోతుతే' అనేవాడు తాత.

తాత కడుపున పుడితేనేంగాక సోములికి తాతపోలిక ఒక్కటీ రాలేదు.

పదిహేనోఏడు, సోములికి షోకుగా గిరిజాలూ చెవులికి ఎఱ్ఱరాళ్ళ దుద్దులూ, వేళ్ళకి ఉంగరాలూ, చార్ల సిల్కు చొక్కా, ఎఱ్ఱసిల్కు కండువా, గ్లాస్కో పంచా, జోళ్ళూ రంగధాముడిలా ఉండేవాడు. కూడా ఎప్పుడూ పదిమంది ఉండేవారు స్నేహితులు చెలువు

# మకుటమార్జించిన అశ్వము



మూడవ హెన్‌రీ కుమారుడు ఎడ్వర్డుని, ఎరల్ ఆఫ్ లిస్టరు ఖైదీగా చేసాడు. గృహ నిర్బంధనం చేసాడు. అతన్ని వెన్నంటి ఆరితేరిన అశ్వదళాధిపతులు వుండేవారు. ఎడ్వర్డు ఆ నిర్బంధనంనుంచి తప్పించుకోనేది కష్టసాధ్యమై పోయింది. కాని అతని శ్రేయోభిలాషి ఎరల్ ఆఫ్ గ్లాయిస్టరు ఒక పన్నుగడపన్నాడు; అతన్ని తప్పించడానికి. అతన్ని చుట్టుముట్టి వున్నవారు గుఱ్ఱపురౌతులు కనుక; వాయువేగ మనోవేగములతో పోయే ఒక వాజిసమును అతనికి అందజేస్తే అతడు తప్పించుకోగలడని యోచించాడు. ఆ విధంగానే ఒక పందెపు గుర్రమును అతనికి కానుకగా పంపాడు.

ఒకనాడు ఎడ్వర్డు తననుచుట్టూ వున్న రక్షకులను గుర్రపు పందాలకు ప్రోత్సహించాడు. పందము వల్ల ఏమీ ప్రమాదం మూడదని అనుకుని వారు వప్పుకొన్నవారు. పందెములో వారి గుఱ్ఱములు అలిసి పోయినవి ఎడ్వర్డు గుఱ్ఱమునకు అలిక అనునది లేదు. కాగా ఆ తరుణంలో అతడు గుఱ్ఱమును హెచ్చరించాడు. అది మారుతవేగంతో యజమానిని శత్రువుల బారినుండి తప్పించింది. ఆ తరువాత తన అనుచరులను పోగుచేసుకొని ఎరల్ ఆఫ్ లిస్టరుని ఓడించి తన తండ్రి రాజ్యమును నిలబెట్టాడు. తండ్రి తదనంతరం అతడు ఒకటవ ఎడ్వర్డుగా యింగ్లాండురాజు అయినాడు. అకిరీటధారణ ఉత్సవసమయంలో అశ్వము తనకు చేసిన ఉపకారమును ప్రసంసిస్తో 500 గుఱ్ఱములను పూజించి యిచ్చవచ్చినట్టు తిరగడానికి గాను విడిచిపెట్టాడు.

గట్టున రావిచెట్టుకింద పదిమందీ, పేకా ట వేసేవారు.

సోములు మాటరాగానే తాత అదో లా విపోయేవాడు.

౨

ప్రకాశంపంతులుగారి జమీందారి బిల్లుతోబాటు యీనాముల బిల్లు వస్తుం దని, ఈనాములుకూడా సాగుబడిదారుల వశమై పోతాయని ప్రజలంతా తహ తహ పడే రోజులు దుండగీడులకు దోసందు సమయం.

గోదావరి పుష్కరాలికి రాజమండ్రీ వెళ్ళి వెంకన్నతాత మరిడీజాడ్యం ఒచ్చి చచ్చిపోయాడు.

వెంకన్నతాత చావుమాట వినీ విన డంలో నాన్న నుంచున్నవాడు నుంచు న్న పాళంగా చాపచుట్టుగా పడ్డాడు. మళ్ళీ లేవలేదు. మంచంమీదే అన్నీని...

వెంకన్నతాత చావుతో మేమంతా ఎండిన చెఱువులోని చేపల్లా బయలుపడి పోయాం స్వాములవారి నట్టిల్లులా ఉంది మా ఇల్లు.

సోములికి స్వరాజ్యంవచ్చింది. 'నువ్వ లా ఊరికే నిలబడు. కథంతా నే నడు పుతాను' అన్నాడుట వీరన్నదోస్తు,

'రశీదివ్వండి మీసిస్తు (25 రూపా యలు) మీకిస్తాను.' అంటాడుసోములు. 'వెంకన్న బిడ్డలకింత పంపుతుంటే తిన డమేగాని, ఈరశీదులూ, ఈ వేలుముద్ర లూ ఎఱుగను' అంటుంది అమ్మ.

'కాలుకూడా ఇదుగో చూడండి' అంటూ ఓకౌయితం చూపిస్తాడు. ఎక్క డిదోగాని.

.....................

# పక్షులు నిద్ర

పక్షులు చెట్ల కొమ్మల మీద హాయిగా నిద్రపోతాయి. కాని మన పిల్లలు పెద్ద మంచాలమీద నుంచికూడా జారిపడినట్లు అవి జారి పడవు ఎంచేత? అన్నది ఒక గడ్డు ప్రశ్న. పరమేశ్వరుడు పాత్రిక బుద్ధి కలవాడు. మానవులకు స్పృహతప్పే సమయంలో దేనిని పట్టుకుంటే దానినే పట్టుకునే శక్తిని స్తే చాలా ప్రమాదాలు వున్నాయని ఆశక్తి లేకండా చేసాడు. మానవునికి స్పృ హ చెడగానే పట్లు తప్పిపోతాయి. పక్షుల కట్లు కాదు. అది చెట్టు కొమ్మపై కూచునివున్నప్పుడు అది తన గోళ్ళను కొమ్మలోనికిగాని రెమ్మనుగాని గట్టిగా గ్రుచ్చి పట్టు కుంటుంది. అది నిద్రపోయినా ఆ నరములు బిగబట్టి పట్టును వీడ కుండావుండే శక్తి వాటి కాళ్ళలో వుంది. అవి నిద్రపోయిన కొద్దీ ఆ పట్టు బిగుస్తుందే కాని సడలదు. అందుచే జారిపడదు. అవి చలి కాలంలోను వానాకాలంలోనుకూ డా ఆ చెట్ల కొమ్మలమీదనే వుం టాయి అంటే చలి వానాకూడా వాటిని ఏమీ చేయలేవన్నమాట. అవి తమ రెక్కలనుసడలించి గాలి ని ఆ రెక్కల సందున బంధిస్తాయి. ఆ గాలి శరీరంయొక్క ఉష్ణంచేత వేడి ఎక్కుతుంది ఆ గాలిని బయ టకు పోనీయకుండా అదిమి పట్టు కుంటుంది తన రెక్కల ఈకల బలి మిచే. అందుచే దానికి ఎండ వానా, చలి మొదలైన ఈతిబాధ లులేవు. అది సృష్టి చిత్రం.

---

ఇటువంటిరోజు జీవితంలో ఉంటుం దని ఎన్నడూ అనుకోలేదు.

కార్తీకసోమవారం. అమ్మ పొద్దుటి నుంచీ అన్నం తినలేదు. ఉపోషంఉంది. సోములు ఇంటినుంచి ఇప్పుడే ఒచ్చింది. గుళ్లోకి వెళ్ళడం ప్రయత్నంలోఉంది. మడిచీర కట్టుగుంది. వత్తీ పత్తీ చేసు గుంది. కొబ్బరికాయ కొనడానికి డబ్బు ల్లేవని ఆలోచిస్తోంది.

ఇంతలో వచ్చింది అన్నయ్యఉత్తరం, అమ్మగారికి నమస్కారములు.

జవహార్లాలు ఈ ఊరువచ్చాడు. మీ టింగుకి మేమంతా వెళ్లాము. జవహ ర్లాలుస్పీచి మమ్మల్నితన్మయుల్నిచేసింది. మీటింగుకి వెడతామంటే హెడ్మాష్టరు పర్మిషను ఇవ్వలేదు. ఉండబట్టక వెళ్లా ము, హెడ్మాష్టరుని ధిక్కరించినందుకు మాకు బాగా ప్రాయశ్చిత్తం ఐంది. ఒక్కొక్క కుఱ్ఱాడికి ఐదేసి రూపాయలు ఫైను వేశారు పరిక్షకికూడా కట్టించ డుట. రాత్రి ఇంటికివెళ్ళి ఏమైనా చేతులో పెడదామని కొందరు కుఱ్ఱా

ళ్ళు ఆలోచిస్తున్నారు. ఏంచెయ్యమంటావ్? పోస్టలుకికూడా డబ్బు కట్టలేదు. పేరు తీసేస్తామంటున్నారు.

ఇట్లు
ప్రియపుత్రుడు
సత్యనారాయణ.

ఉత్తరం అమ్మకి చదివి వినిపించాను.

'నారాయణమూర్తీ' మాకష్టాలికి అంతెప్పుడు నాయనా? అంటూ గోడవార కూలబడిపోయింది.

'మా కామధేనువుని సోమన్న పొట్టెట్టుకున్నాడు. మా వెంకన్న మమ్మల్ని వదిలేసి వెళ్ళిపోయాడు. నన్నుకూడా తీసుకుపోరాదా తండ్రీ? అని కుమిలి కుమిలి ఏడుస్తోంది.

అమ్మనిమూసి చెల్లెళ్ళూ, తమ్ముడూ కూడా ఏడవడం మొదలెట్టారు. 'ఏమిటిరా నాకు చెప్పండిరా?' ఎవరేనా నన్నలా తీసికెళ్ళండిరా' అంటూ లేవబోయి మంచంమ్మీదనుంచి కిందపడ్డాడు నాన్న.

నాకు తల తిరిగిపోతోంది. వెంకన్న తాత మా అందరివేపూ జాలిగా కళ్ళనీళ్ళతో చూస్తూ 'అమ్మాయిగారూ! నేనిలా మీకు ఏమీ చెయ్యలేనివాణ్ణి అయిపోయానుగదా అంటూ నిలబడ్డాడు. 'తాతా' అని అరిచాను నేను.

లేదు... వెళ్ళిపోయాడుగాబోలు.

మా కామధేనువు మాచేతుల్లోంచి పోయింది. మా తాత మమ్మల్ని విడిచిపెట్టి వెళ్ళిపోయాడు. మా కామధేనువు మళ్ళీ మా కిప్పించేందుకు ఇప్పుడు 'ఏడీ విష్ణుమూర్తి'.

## పాపాయి

బంగారు మాచిట్టి
పట్టింది పోరు
జామికొమ్మలపైన
జారు చిలుకల్లార
మావి కొమ్మలలోన
కూయు కోయిలలార
పరిజాలరులమీద
వ్రాలు పిచుకల్లార
అంబరంబున ఎగురు
అండజములార
పురివిప్పి నర్తించు
నెమలి కన్నియలార
పడగిప్పి ఆడేటి
పన్నగరాజా
ఝులఝులాపారేటి
సెలయేటి పూటా
కన్నె తావుల జిమ్ము
కన్నె గులాబీ
ఝుమ్మని పాడేటి
తుమ్మెద తేడా
మిన్కు మిన్కుమను
మింట చుక్కల్లార
చల్లని వెన్నెల
చల్లు జాబిల్లీ
బంగారు కిరణాల
బాల భానుండ
మెలమెల్ల వీచేటి
మలయ పవనుండా
పాపాయి నొకసారి
పలుకరించండీ
అమ్మాయి నొకసారి
ఆడించిపొండి.

—జి. కోటయ్య.

# భగ్న ప్రేమ

సీతా రాములమధ్య: ప్రేమలత అతి గోముగా పెరిగింది
కాని ధనాభావము ఆ లతకు వేరు పురుగయింది.

రచయిత్రి :

## ఇందిరాదేవి

అవి నేను చదువుకునే రోజులు. ఆ యేడు వేసంగి సెలవులు యివ్వగానే మా స్వగ్రామం వుడాయించాను. తేతముంజలూ, మామిడిపండ్లూ, పనసపండ్లూ నిత్యం నైవేద్యాలు అవుతాయన్న ఆశతో.

నేను మా వూరు వెళ్ళిన పది రోజులకి మా అక్కయ్యకి మూడిద పట్టుకు వెళ్ళడానికి సరంజామం చేస్తూ వుంది మా అమ్మ.

మా అక్కయ్య అంటే మా పెత్తల్లికూతురు. ఆమె తల్లి చిన్నతనంలోనే నూతిలోపడి చనిపోయింది. అప్పటినుంచీ మా అమ్మే ఆమెను పెంచింది. నేనంటే అక్కకు అపరమితమైన ప్రేమ. తమ్ముడూ! అని ఎంతో ముద్దుగా పిలుస్తూవుండేది. చక్కగా తలదువ్వి బొట్టుపెడుతూ వుండేదిమా అమ్మకి నేను పుట్టేవరకు ఆడపిల్లలు లేరు. మా అక్కయ్యఅంటే అమ్మకు ఆప్యాయంగావుండేది. అక్కయ్యకు యుక్తవయస్సురాగానే ఎదురు మేనరికం ఇచ్చి పెండ్లి చేసింది అమ్మ.

మా మేనమామలు చాలా మోతుబరులు. ఇచ్ఛాపురంలో భూములు, సగానికిసగం వారివే. ఆ వూరికి దక్షిణంవైపు ఒక పెద్ద చెరువుంది. చెరువుకి పడమటివైపు పెద్ద తోట ఆ తోట నానుకుని ఒక కొండదాని చుట్టూ యింకా చిన్న చిన్నకొండలు వున్నాయి. అక్కడి ప్రకృతి చాలా రమ్యంగా వుండేది.

మా మేనమామలు ముగ్గురన్నదమ్ములు. పెద్దమామ కొడుక్కి యిచ్చారు అక్కయ్యను. మా రెండో మేనమామగారికి నలుగురు కొడుకులు యిద్దరు కూతుళ్ళు, మూడో మేనమామగార్కి ఒక్కర్తే కూతురు ఆమె పేరు సీతాదేవి లేక లేక చాలాదినాలకి పుట్టింది. మా మేనమామభార్యకు కూతురంటే పంచప్రాణాలు అన్నమాట. ఒకసారి ఆ పిల్లమీద ప్రేమకొద్దీ పొగుగూరిలోవున్న పిల్లకొరకు బుట్టెడు సపోటాపళ్ళు వట్టినే కుళ్ళబెట్టింది ఎవరికీ పెట్టకండా దాచి.

మా అమ్మ మా తాతగారి వూరు వెళ్ళినప్పుడు అల్లా నేనూ సీతా చిలకా గోరివంకలాగ ఆడుకుంటూ వుండేవాళ్లం. మా అమ్మమ్మ మిసపరొట్టె, వండిపెడుతూ వుండేది ఆడుకోమని ఆ వేసంగిలో మా తాతగారి వూరు మా అమ్మ వెడుతోంది అనేసరికి యీచిన్నతనపు చేష్టలన్నీ ఒక్కసారిగానా దృక్పథాన్ని నృత్యం చేసాయి.

మంచిరోజు చూసి మా అమ్మ రెండు కొత్త బిందెలనిండా పంచదార చిలకలుచినామిఠాయి మొదలైనవి అమర్చి పసుపుగుడ్డలు వాసినికట్టింది ఒక అరిటిపళ్ళగెలా పసుపుకొమ్ములు కుంకుమఒక బుట్టలో పెట్టింది, అన్నీ సిద్ధమైన తరువాత సాయంకాలం అన్నాలు తిని చల్లప్రొద్దున నెలపొడవగానే రెండెడ్లబండి కట్టుకొని ఝాంప్రొద్దు ఎక్కేసరికి ఇచ్ఛాపురం చేరుకున్నాము.

నేను బండి దిగేసరికి ఎప్పుడు వచ్చావు బావా! అంటూ ఉషకాంతులకు వికసించిన పద్మలా కలకలాడే ముఖంతో పరుగునవచ్చి నా చెయిపట్టుకుంది సీత. ఆ స్వాగతానికి నా హృదయం ఉప్పొంగిపోయింది.

ఒకనాడు సాయంకాలం చక్కగా తలదువ్వుకొని వాలుజడ వేసు

కొని కంటినిండా కాటుకపెట్టుకొని దక్షిణాది పరికిణీ కట్టుకొని శేలం కండువా పమిటవేసుకొని ముద్దులా నిద్రపోతున్న నా దగ్గరకు వచ్చి వీపుమీద చరిచి యింకా నిద్రే కుంభకర్ణుడు చచ్చిపోతూ నీకిచ్చిపోయాడేమిటి బావా నిద్ర! లే! అని పకపక నవ్వసాగింది ఆ నవ్వు నాకు అంకుశంలాగ గ్రుచ్చుకుంది. చివాలున లేచి ఏం పుట్టిమునిగిందే అంటూ కండ్లు నులుపుకుంటూ వున్నాను నిద్ర బద్ధకంచేత. నా రెండు చేతులు ముందుకి లాగి తోటలోకి షికారు వెడదాం వస్తావా! అంది అతిమధురంగా.

నిద్రముఖం కడుకుని తెల్లచొక్కా పంట్లాం తొడుకొని తయారైయాను షికారుకి.

మాతో మా బావ కూతుళ్ళు మా చెలెంద్రుకూడా తయారైనారు.

మేము అందరమూ బండి ఎక్కి చెరువుప్రక్క తోటలోకి వెళ్ళాం.

ఆ తోట ఆ రోజుల్లో నందన వనంలా వుండేది. ఒకమాటు నుయ్యి కూడా వుంది.

తోటలోకి వెళ్ళేటప్పడికే కుర్రాళ్ళు దాహమన్నారు. నూతి దగ్గరకు తీసుకుని వెళ్ళి మంచినీళ్ళు యిప్పించాను.

రత్నం :—మామయ్యా! ముంజకాయలు కొట్టించవూ? అని.

జానకి:—మామయ్యా! ముందు కొబ్బరికాయలు తీయించు అని, నలుగురూ నాలుగుమూలలా దుయ్యబట్టుకొన్నారు వీళ్ళందరూ పీకుతోవుంటే మా సీతాదేవి నాకేసిచూసి పకపక నవ్వింది, దాని నవ్వులో నేను పిల్లలతండ్రి నయ్యినట్టుగా తోచింది.

సీత ముంజలు తిని చేతులు కడుకునివచ్చి ఆ చేతులు నాకు తుడుస్తునట్టు తెలియకుండా వుండాలని వెనకగావచ్చి రెండుచేతులు భుజం మీదవేసి బావా! సంపెంగపువ్వు మంచి సువాసనగా వుంది ఎక్కడుందో వెతికి కోసిపెట్టవు అంది ఆ సమయంలో పైకిచూసేసరికి ఆమె కళ్ళల్లో నాకో ఏదో అర్థంకాని వెలుగు గోచరించింది. అహో అది ఎంతపని అని నూతిదగ్గరవున్న సంపెంగపొద గాలించాను. బాగాపండి ఘుమఘుమలాడిపోతున్న సంపెంగ పువ్వులు ఐదు దొరికాయి. నీ యిష్టము వచ్చినన్ని తీసుకో అన్నా. ఆకులతోవున్నవి మూడు తీసుకుంది. మిగతావి పిల్లలు తీసుకొన్నారు. పువ్వులను కసేపు చేతులోనేవుంచుకుని దిక్కులు చూసింది. పెట్టుకో చూస్తావేం అన్నా. 'నేను పెట్టుకుంటే జుత్తు రేగిపోతుంది నీవే పెట్టు బావా!' అంది.

సూర్యుడు అస్తమించాడు.

కొండ శిఖరం అగ్ని పుంజంలా వుంది. కాని తూర్పువెంపు మామిడిచెట్లతోను చిన్ని చిన్ని పొదలతోను మనోహరంగా వుంది.

బావా! కొండ ఎక్కాలి యీవేళ అంది మా సీత. నీకు ఓపిక వుందా అయినా పొద్దుపోయింది పెందరాళే యిల్లు జేరకపోతే తిడతారు యీ పిల్లలతోటి అన్నా పెదబాధ్యత వున్నవాడిలా.

ఈ వేళ పున్నమోయి బావ. పొద్దుపోయినా ఫరవాలేదు లే మళ్ళీ ఎప్పుడు వస్తావో నీవు ఒకసారి కొండఎక్కి చూసివద్దాం రా అంది.

పిల్లలను బండివానికి అప్పగించి మేమిద్దరం కొండ ఎక్కాం. సగానికి ఎక్కేసరికి అలసిపోయింది. ఇంక ఎక్కలేనని ఒక పాషాణం మీద చతికిలబడింది. ఇంతేనా అంటూ నేను క్రిందకి దిగివచ్చి ఆమె వెనకాల కూచున్నా.

పండువెన్నెల పిండిఆరపోసినట్టు అయింది. ఆ కొండ ఆ సుధాకరుని బాహువల్లరిలో వెండి కొండలా వుంది.

మామిడిచెట్లమీద కోవిలలు కుహూ కుహూమంటే మా సీత వాటిని ఎక్కిరిపిస్తోంది తనూ ఒక కోకిల అనుకొని. ఎదుటవున్న చెరువులో కుముదలు ఆమె కూతలకు పరిహాసంగా నవ్వుతున్నవా అన్నట్టు కలకలవిచ్చాయి. ఆ నీటిమీద నుండి వచ్చే గాలులు చల్లగా అహలాదకరంగా వున్నాయి.

బావా! యీవేళ చంద్రబింబం ఎంత బాగుందో చూసావా అంటూనామీదకు వరిగి నామోకాళ్ళమీద ఆమె శిరమును వుంచింది.

సీతనుకూడా మా అమ్మ. మా వూరు తీసుకొచ్చింది అమ్మవారి తీర్థం నెపంపెట్టి, మా అత్తకు మొదట్లో కూతురును పంపడానికి యిష్టంలేదు యీడువచ్చిన పిల్ల అని. కాని తల్లితరువాత మేనత్త కదా అని పంపింది,

బండీలో ఆమె సరసను కూచుంటే నాకెంతో హాయి అనిపించింది. సీత తన కోడలవుతుంది అనుకునేది. మాఅమ్మ మాఅన్యోన్యతచూసి.

అది వైశాఖ పూర్ణిమ పుచ్చపువ్వులా వెన్నెల కాస్తోంది. ఆ రోజు మావూరి అమ్మవారి జాతర.

రాత్రి పంద్రెండుగంటలయి వుంటుంది, అత్తా శ్రీరామమూర్తిని నన్ను జాగరానికి తీసుకువెళ్ళమనవూ అంది గారాంగా. అదెంత భాగ్యమమ్మా దొడ్డిగుమ్మంలోకి వెళ్ళి చూసిరండి అంది మా అమ్మ ఆమాట దొరబుచ్చుకొని మాంగన్నుగా నిద్రపోతున్ననన్ను రెక్కపట్టిలాగి బావా? రామరి వెడదాం జాగరానికంది, మనం వెళ్ళకూడదే! ఆ మాలసంతలోకన్నా బద్ధకంచేత అయితే యింతోటి మాలతీర్థానికేనా నన్ను కోరి తీసుకొచ్చావంది నామాట నాకు నప్పగిస్తూ, నాకు మెరుపుదబ్బ తగిలినట్టు అయింది సరే పద అంటూ తూలుతూ ఆమె వెంటనడిచాను పెరటి గుమ్మందగ్గరకు వెళ్ళేసరికి మల్లిమొగ్గలు ఆరవిచ్చి మమ్ములను పరిహసిస్తున్నట్టు వున్నాయి. చేమంతిపూలు వికవిక మంటున్నాయి. బావా! గుడిదగ్గర బాజాలులేవే కాసేపు యీ దొడ్లో అరుగుమీద కూచుందాం వచ్చాక వెడదామని నా రెక్కపట్టుకు లాగి తనవళ్ళో కూచోబెట్టుకుంది. అక్కడ కూచుని ఏవేవో మధురభావాలను తలపోసుకున్నాం. బావా! నీచేయి ఏది అని చూసి నీవుంగరం నాకు సరిపోయిందంటూ నావుంగరం తాను ధరించింది ఆ రాత్రి.

ఆమరునాడు తీర్థంలో నేనూ సీత కలసి గుళ్ళోకి. వెళ్లాం పళ్లుయియ్యడానికి ఆచాకల ముండావాడు నాకేసి సీతకేసి చూసి బాబయ్యగారికి యీయేడు పెళ్ళిఅయ్యేట్టు దీవించుతల్లీ ! అంటో మొక్కాడు మేముయిచ్చిన పళ్లు మూలపడేస్తో సీత నవ్వింది ముసిముసిగా.

ఆమరునాడే మా మేనమామ బండి పంపుతూ తాను వన సంతర్పణ చేస్తున్నానని అందరూ వక్కసారివచ్చి వెళ్ళవలసిందని వర్తమానం పంపాడు అమ్మా సీత పిల్లలు అంతా వెళ్ళారు నేను వుండిపోవలసి వచ్చింది.

సీత వెడుతో బావా! వెళ్ళివస్తాను జ్ఞాపకం పెట్టుకోవేం అంది జాలిగా నాచేతిలో చేయివేసి. అంతే నేను చదువుకొరకు చెన్నపట్టణం వెళ్ళాను. నేను చెన్నపట్టణం వెళ్ళిన సంవత్సరమే. సీతకు వివాహం అయింది. సీత తల్లికి తనకూతుర్ని ఒక జమీందారుకి యియ్యాలనివుండేది. మా మేనమామ ఎంత పట్టుపట్టినా మాబీదతనంచూసి మా అత్త ఈ సంబంధానికి వప్పుకోలేదు. పిల్ల వుద్దేశం కూడా కనుక్కోకండా పట్టుపట్టి పెండ్లిచేసింది. దానిని పెండ్లి అంటారు పెద్దలు. కాని సీతకు అది ఒక బలివంటిది. తల్లి ధనకాంక్షకు తనను బలియిచ్చిందని అంటుంది.

---

# అహం బ్రహ్మాస్మి

పెర్షియా సుల్తాన్ దగ్గరకు, ఒకరోజున ఒక పిచ్చివాణ్ణి పోలీసులు పట్టుకు వచ్చారు.

అతడు చేసిన నేరం ఏమిటని సుల్తాన్ అడిగాడు.

'తను భగవంతుణ్ణని చెప్పుకుంటున్నాడు' అని భటులు జవాబు చెప్పారు.

సుల్తాన్‌కు నిజంగా కోపం వచ్చింది.

"భగవంతుడి దూతనని చెప్పుకుంటూవున్న ఒక పిచ్చివాణ్ణి ఈ మధ్య ఉరితీశా తెలుసునా ?" అని సుల్తాన్ దబాయించాడు.

ఆ పిచ్చివాడు బెదరకుండా ఇలా అన్నాడు.

"వెధవకి మంచి పనిచేశారు; నేను నా దూతగా ఎవర్నీ ఇక్కడకు పంపించలేదు."

—ఒక చాటు కథ.



## ఆవేదన

స్వాదుజలమును దాపుచు సాకినట్టి
కాయమానంబె కంటక ప్రాయమైన
వధ్య శిలయయ్యె నామృదు ప్రసవమునకు
కమ్మ తావుల నోడినింపు తెమ్మెరలును
ఘోరఝంఝానిలములోన కుమిలిపోయె !

వాడి యెండిన వగరైన వట్టి చెత్త
ముండ్ల పొదపైన నొంటిగా మూల్గుచుండె
జీవనంబిచ్చి భర్తయై చెంతనున్న
లతయు నశియించె, చెప్పజాలను కతంబు.

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

కావ్యరస జీవనంబు విజ్ఞానమధుర
దుగ్ధ నిష్యందమానంద ద్యోతకంబు
ముసలి కోతుల పాలాయె మొండిరాళ్ళ
నోళ్ళలోబడి యింకి, నన్నొల్లవయ్యె

మందగతి హాయిగా గీత మాలపింప,
ప్రేతభూముల నిశ్శబ్ద భీకరతకు
రక్తవాహినిలోన పొర్లాడు శవము
కంఠశోషలో లీనమై కరగిపోయె.

— బూర్గుల గంగానాథరావు.

# ఫలరాజము : మామిడిపండు

ఫలరాజము మామిడిపండు. మామిడి ఎరుగనివారు హిందూదేశంలో ఎవరూ వుండరు. ఈ ఆర్యావర్తనమున ఆసేతు హిమాచలపర్యంతం అన్ని ప్రాంతాలలోను మామిడిపండ్లు ఫలిస్తాయి. ఒక హిందూదేశంలోనే కాదు దూరప్రాచ్యదేశాలన్నిటిలోనూ విస్తారంగా ఫలిస్తాయి. మలయా, జావా, క్యూబా, దక్షిణ అమెరికా, ఈజిప్టు, ఫ్లారిడా, ఫిలిప్పైన్ దీవులు, సిలోన్ మొదలగు చోట్ల బాగా మామిడిపండ్లు దొరుకుతాయి. హిందూదేశంలో మామిడితోటలు లేని రాష్ట్రమే లేదు. ఎక్కడపడితే అక్కడ పెరుగుతుంటి మామిడిచెట్టు. ఒక మదరాసు రాజధానిలోనే సుమారు 200,000 ఎకరముల మామిడితోటలు వున్నాయి.

మామిడితోరణం కట్టనిదే భారతదేశంలో శుభకార్యమే జరగదు. అంతటి పవిత్రస్థానం పొందింది ఈ కల్పతరువు. ఈ వృక్షముయొక్క ఆకులనుంచి పండువరకు సర్వము మానవుడు ఉపయోగించుకుంటున్నాడు.

ప్రణయగీతికలను పాడుతూ యువతీ యువకులను పురికొల్పి సృష్టికి దోహదంచేసే కోకిలకు ఈ చూతతరువే ఆటపట్టు. మహాకవుల కావ్యరసామృతధారలకు ఆధారభూతము మామిడిచెట్టే. యుగయుగాలుగా జీవించివున్న మామిడిచెట్లు అనేకం వున్నవి. వాటికి నీరు అధికంగా అవసరం లేదు కాబట్టి ఎట్టి శీతోష్ణస్థితిలోనైనా పెరుగుతాయి. కాని సమశీతోష్ణస్థితిగల ప్రదేశములో విరివిగా పెరుగుతాయి.

మామిడిపండు ఆహార పదార్థంగా చాలా విలువ అయినది. బాగా పండిన బంగినపల్లి మామిడిపండ్లు, రసాలు, మంచి పరిమళం వేస్తాయి. పండ్లుచూసేసరికి నోరు వూరుతుంది, మామిడిపండు హృదయమునకు మంచి బలమునిస్తుంది. కండపుష్టి. శరీరసౌష్టవం సమకూడుస్తుంది. రక్తమును శుద్ధిచేసే శక్తి దానియందు వుంది. ఆ ఫలము యతులను మహాపురుషులనే ఆకర్షిస్తుందంటే సామాన్యుల లెక్క.

మామిడిపండులో ఆపిల్ పండులో వున్న సి విటమిన్‌కన్నా ఎక్కువవుంది. ఒక సి ఏకాకండా విటమిను ఏ, బి, సి, బి2 మొదలగు విటమినులు అధికంగా వున్నాయి. మామిడిపండులో మధురపదార్థం కూడా ఎక్కువగా వుంది. ఫాస్ఫరిక్ ద్రావకము, కాల్షియమ్ తక్కువ. మొత్తంమీద మామిడిపండు ఫలరాజమని చెప్పాలి.

మామిడికాయ పిందె మొదలు పండు వరకు అనేకవిధాలయిన ఆహారంగా పనికివస్తోంది. ఈవిధంగా మరి ఏ ఫలము ఉపయోగకారి కావడంలేదు. చిన్నపిందెలుగా వున్నప్పుడు వడబద్దలుగాను, పచ్చడిగాను, పప్పులోను, కూరలలోను ఉపయోగిస్తున్నాము. ముదిరిన వెనుక ఆవకాయి, మాగాయి, మెంతికాయి మొదలగు ఊరగాయగా వినియోగిస్తున్నాము. పండిన వెనుక పండుగాను, తాండ్రగాను వుపయోగమౌతోంది.

మొత్తంమీద మామిడికాయను ఏదో విధంగా వుపయోగించని గృహం కాని రోజు కాని వుండదు. అందులోను ఆంధ్రదేశంలో అసలువుండదని నా విశ్వాసం. కాగా మామిడిపండును ఫలరాజమనుట అతిశయోక్తి కానేరదు.



# చతురమతి విమల

రచయిత్రి :
'కుమారి దేవి'

౧

విమల రూపసి చక్కని చుక్క విశేషించి విద్యావతి. కాని ఆమె రూపలావణ్యాలకుతగిన భర్త లభింపలేదు. కాకిముక్కుకి దొండపండులావుంది వారి దాంపత్యం. ఆమె భర్త ఒక మిలటరీ ఉద్యోగి. యుద్ధంరాగానే అతడు యుద్ధానికివెళ్లాడు. భార్యను తనకుటుంబ మిత్రులలో ఒకనికి అప్పగించి వెళ్ళాడు. ఆ మిత్రుడు వయోవృద్ధు. కాగా ఆమె యోగక్షేమాలు నిరాఘాటంగా కనుక్కోగలడని విమల భర్త తలచాడు. కాని స్త్రీ హృదయము మహాఘూతమని దాని మర్మములు కనిపెట్టడం బ్రహ్మకుకూడా శక్యంకాదని ఎలా అనుకుంటాడు!

ఇంట భర్త లేకపోవడం పని పాటలు లేకపోవడంచేత పగలంతా ఆమెకు ఏమీ తోచక మేడమీద గదిలో కిటికీదగ్గర కుర్చీ వేసుకొని కూచుని వీధినివచ్చి పోయేవాళ్ళను చూస్తూ వుండేది.

అది పున్నమినాటి రాత్రి సుమారు ఎనిమిదిగంటలవుతుంది. ఆమె భోజనంచేసి డాబామీద తచ్చాడుతోంది. ఆ రోజున మూర్తి ఆఫీసునుండి యింటికి వస్తున్నాడు.

మూర్తి ఇరువదిఏండ్ల యువకుడు అన్యకాంతలను కన్నెత్తి చూచి ఎరుగడు కాని ప్రవరాఖ్యుడు కాడు. ఆమె డాబామీదనుంచి మూర్తిని చూచింది. అసలేకోతి అది కల్లుతాగినమీదట తేలుకుడితే ఎలావుంటుందో అలా వుంది విమల హృదయం ఆ రేయి. తారా మనోహరుడు విజృంభించాడేమో దానికి తోడు అతని మేనల్లుడుకూడా ఆమెను వేధింపసాగాడు. ఆమె హృదయంలో నూతనభావాలు రేకెత్తాయి ఆమె సౌశీల్యము పటాపంచలయింది. ఆ రాత్రి ఆమెకు నిద్రపట్టలేదు. మూర్తి ఎట్లు [illegible] అన్నదే ఆమెది ధ్యాస

స్త్రీ బుద్ధి ప్రళయాంతకః అన్నారు పెద్దలు వూరికినే అన్నారా? కుశాగ్రబుద్ధి ఒక పన్నాగడపన్నినది. మూర్తిని ఆకర్షించడమే ఆమె నిశ్చయం. కాని అది బ్రహ్మరహస్యంగా వుండాలి.

ఆ మరునాడు జగ్గరాజు విమల యోగక్షేమం కనుక్కోడానికి వచ్చాడు. ఆమె అతనిచేతనే అతడు అనుమానం పడకుండా తన ప్రియుని యింటికి తెప్పించుకోడానికి పన్నాగం పన్నింది.

జగ్గరాజు మామూలుగా "ఏమమ్మా విమలా! క్షేమంగా వుంటున్నావా? వేణు, నీ యోగక్షేమం తరచు తెలియజేయమని నా పేర ఒక జాబుకూడా వ్రాసాడు" అన్నాడు. క్షేమానికేమిలెండి ఏదో రోజులు గడిచిపోతున్నాయిగా... ఏమమ్మా అంత విరక్తిగా వుండటానికి కారణం? ఏమిచెప్పను 'బాబుగారూ! ఈజన్మకి క్షేమమెక్కడ తండ్రివంటివారు గనక చెప్తున్నాను మరి ఎవరికేనా తెలిస్తే అప్రతిష్టకూడాను. ఆ శేషమ్మగారి కుమారుడట మూర్తి! ఆ! ఆ! వాడా! కృష్ణమూర్తి వాడు? నిన్న రాత్రి వెన్నెలగా వుంది కదా అని మేడమీద తిరుగుతూవుంటే అదే పనిగా [illegible] గుమ్మముము గుతచ్చాడట, కిటికీ నుంచి [illegible]లకి తొ[illegible] సకిలించడం మొద[illegible] చేసాడు ఇంట్లో ఎవరూ లేకపోవడం నేను వంటరిగావుండడం నాకు చాలా భయమేసిందండి బాబు

గారూ' అంటూ బుడబుడ దుఃఖాలు తీయడం ప్రారంభించింది చీర చెరగుతో కండ్లు తుడుచుకుంటున్నట్టు నటించింది. ఆ సమయంలో ఆమె వళ్ళు గగుర్పొడిచింది మోవి వడకసాగింది. మాటలు తబ్బిబ్బైనాయి. ఆమూర్తి అల్లాటివాడు కాడమ్మా. నిజంగా మూర్తిని మీరు సరీగా చూసారా!

'నిజంగా మూర్తేనండి నాకళ్లారా చూసాను.' అంది విమల.

ఆడది బొంకితే గోడకట్టినట్టు వుంటుంది అన్నారు పెద్దలు.

ఆరోజు సాయంకాలం జగ్గరాజు క్లబ్బుకి వెళ్ళాడు. మూర్తి చదరంగం ఆడుకుంటూ వున్నాడు జగ్గరాజును చూడగానే చివాలున లేచి ఒక నమస్కారబాణం వేసి ఏంతాతగారూ ఈవేళ యిలా దయచేసారు అంటూ దగ్గిరికి వచ్చాడు. మూర్తిని జగ్గరాజు ఆపాదమస్తకము ఒక్కసారి తీవ్రంగా చూచాడు. ఆచూపులకు తట్టుకోలేక మూర్తి తలవంచుకున్నాడు. ఏదో పిడుగు మీదపడనున్నదని గ్రహించాడు తాతగారివైఖరి చూసి కాని ఆపిడుగేమిటో తెలుసుకోడానికి తహతహ పడసాగింది అతని లేత హృదయం.

మూర్తి రూపవంతుడేకాక గుణవంతుడు కూడాను స్త్రీలు అతని సౌందర్యానికి మోహితులు అవడంలో ఆశ్చర్యంలేదు జగ్గరాజుకి విమలమీద అభిమానం అమితం. కాగా ఆమె శీలమును అతడు శంకింప సాహసింపలేదు. అందుచేత మూర్తి ఏదో చిలిపిచేష్టలు చేసి వుంటాడని మందలించాలని అనుకున్నాడు.

ఈ ఆలోచనలన్నీ క్షణంలో తాతగారి బుర్రలో గిర్రున తిరిగి పోయాయి.

'దయచేయండి అలాగే నిలబడి పోయారేం' అన్నాడు మూర్తి.

ఏమీలేదు అబ్బాయి. నిన్ను చూస్తే జాలివేస్తోంది అందుచేత ఏదో ఆలోచనలో మునిగిపోయి నిలబడిపోయాను అన్నాడు

'నేనేం చేసానండి అన్నాడు' మూర్తి అమాయకంగా.

నాదగ్గర ఎందుకు దాస్తావు అంతా తెలిసిపోయిందిలే. నిన్న రాత్రి విమల యింటిముందు కాలుగాలిన పిల్లిలా తారాడావుట కదూ!

# పల్లె పదాలు

## ౧ (దంపుళ్ల పాటలు)

౧ నీలగిరి చెరువులో । పాలగిరిపిట్ట
నీళ్లన్ని యిగిరితే । నీయాటలేల ?
అన్నయ్య తొడమీద । ఆశేటబ్బాయి!
మీయమ్మ గర్భిణి । నీయాటలేల ?

౨ రోకలిచిన్నాది । రోలు చిన్నాది
నాతోటి పోటేయు । నాతిచిన్నాది
విత్తనాలగంప । నెత్తినెట్టుకొని
విచారపడ్డాడె । విష్ణుకొంతుండు

౪ వేరు లేని వృక్షాలు । పెద్ద వెలగళ్లు
కారుగోగుల సరస । కదలె బాపన్న
తుంగభద్రలు కదలు । తులశమ్మ కదలు
వనరాశి తుంగభద్ర । వనమంత కదలు

౫ కాటుక చుక్క బొట్టు । కడిగినా పోదు
నొష్టవ్రాసిన వ్రాలు । తుడిచినా పోదు
అడ్డచెరుగులు పెట్టి । అద్దినాబోదు
పైట చెంగుబెట్టి । పులిమినాబోదు.

## ౨ (రాట్నము పాటలు)

అందచందములేని । ఆడకూతురుకు
అందమేసుపరచు । ఆ ప్రత్తిచెట్టు
పాడిపంటలున్న । బంగారమిచ్చు
పయిడిప్రత్తిని పెంచ । బంగారునిధులె
పాలు పెరుగులన్ని । పాపలకొఱకె
ప్రత్తి నూలు దీయ । పాత్రలకొఱకె
కవ్వమాడిన యిల్లు । కదురుద్రిప్పినచోటు
మగ్గముగల యూరు । మహాలక్ష్మి యగు
రాటంబు చిన్నాది । కదురు చిన్నాది
సరసనా వడికేటి । సకియ చిన్నాది
సకియ కట్టినచీర । సరిగంచు రవిక
మోనపాలద్దలము । ముచ్చటమాడు
రాటాల మోతమ్మ । రవ్వల మోత
కనకగిరి గొల్లోరి । కవ్వాల మోత.

—నేదునూరి గంగాధరం

మూర్తికి నవ్వొచ్చింది, దానిని అణచుకుంటూ 'విమల ఎవరండీ!' అన్నాడు. మీకీవిషయం ఎవరు చెప్పారండి విమల ఎవరో తెలియనే తెలియదా దొంగ మాటలూ నీవూను మన వీధిలో వున్న నరసరాజుగారి కోడలు మన వేణుగోపాలరావు భార్య. ఈమధ్యనే కాపరానికి వచ్చింది. వేణు ఈమధ్యనేగా కింగ్సు కమీషను తీసుకొని యుద్ధంలోకి వెళ్ళాడు. తెలియదూ? ఆమే చెప్పింది అన్నాడు జగ్గరాజు.

ఆమెను నేను ఎప్పుడు చూడనైనా చూడలేదే అన్నాడు మూర్తి. పూర్వం చూసినా చూడకపోయినా ఇక ఎప్పుడు అటు పోనని ఆ యింటివైపు చూడనని వట్టు పెట్టుకోమని బలవంతం చేసాడు జగ్గరాజు మూర్తిని. అతనిమీద వుండే ఆదరాభిమానాలవల్ల మూర్తి అటువైపు చూడనని అతనికి వాగ్దానం చేసాడు. సంతృప్త హృదయంతో జగ్గరాజు సభవిడిచి వెళ్ళిపోయాడు.

## ౨

వనిత ఎదురుపడేవరకే మగవారి బింకాలు.

జగ్గరాజు వెళ్ళిపోయినప్పటినుంచి మూర్తిహృదయంలో కైళ్లు పరుగెత్తాయి. ఎప్పుడు వనితాజన వ్యాసంగములేని మూర్తికి విమలను చూడాలన్న వాంఛ పుట్టింది.

నిర్బంధనవల్లనే ఏ ఉద్యమమైనా రేకెత్తుతుంది. అణిచిపెట్టినకొద్దీ వత్తిడిశక్తి అధికమౌతుంది కదా! తను చూడనిదే చూచాడని ఆమె ఎందుకు తనమీద చాడీ చెప్పివుంటుందా అన్న ప్రశ్న మూర్తిని వేధించేసింది అతని తల తిరిగిపోయింది ఆనాటి సాయంకాలం ఆమెను తప్పకుండా చూడాలని ఉవ్విళ్ళూరాడు.

ఎప్పుడూ తలఎత్తి పైకిచూడని మూర్తి ఆరోజున ఆకాశంవంక చూస్తూ నడవసాగాడు. విమల యింటిముందుకి వచ్చేటప్పటికి అతని కాళ్లు ముందుకి సాగలేదు మెరుపుతీగలా విమల మేడమీద కనుపించి మాయమయింది, ఆ విద్యుల్లతను మరి ఒకసారి చూడాలని నిరీక్షిస్తూ నిలుచునిపోయాడు ఎంతకీ ఆమె తిరిగి కనుపించలేదు విధిలేక ముందుకి సాగ నారంభించాడు. కాని అతనిముందు ఒక తెల్లని రుమాలు పొర్లుతోంది ఆరుమాలు ఘుమఘుమగా సువాసన కొడుతూవుంది అది విమల రుమాలు, మూర్తిని చూడగానే చటాలున గోడమీదనుంచి లేచి వెళ్ళేటప్పుడు జారిపోయింది. రుమాలు నెపం మీద ఆమెను పలకరించవచ్చుననుకొని రుమాలు చేతపట్టుకొని తలుపు తట్టాడు విమల తలుపు తీసింది 'ఎవరుమీరు.' అంటూ ఎవరూలేరు నేనే మీ రుమాలు వీధిలో పడిపోయిందిగా అంటూ రుమాలు అందియ్యబోయాడు మూర్తి హృదయం దడదడ కొట్టుకోసాగింది. శరీరం కంపించింది విమల సిగ్గుతెరలలో చిక్కుకుంది, కొంతవరకూ నిశ్శబ్ధం. మూర్తి అక్కడ నిలువలేక గుమాలు జారవిడిచి చరచరా వెళ్ళిపోయాడు. ధన్యవాదాలు అన్న మాటలు అతన్ని వెంటాడించాయి మరునాడు ఆమెను చూడాలని మూర్తి ఆయింటిముందు తిరిగాడు కాని ఆమె కనుపించలేదు.

కాని అతను క్లబ్బునకు వెళ్ళేసరికి జగ్గరాజు కోపోద్దీపితుడై ప్రత్యక్ష దండధరుడులాగ కూచుని వున్నాడు. మూర్తిని చూసీ

## మహావాక్య రత్నాలు

శత్రు మధ్యనున్నవాడు ఎంత మెలకువతో వుంటాడో పుత్రుల మధ్యనున్నవాడు అంత జాగరూకతతో వుండాలి.

*—Halifaso*

స్త్రీలలో జాలివల్ల ప్రేమ ఉద్భవిస్తుంది. మగవారిలో ప్రేమవల్ల జాలి కలుగుతుంది.

*—Blake*

మగవాని హృదయంలో సుమారు నలుబదిరకాల విచిత్రప్రేమ వాహినులు ప్రవహిస్తాయి. స్త్రీ హృదయంలో ప్రవహించే ప్రేమ వాహినులకు లెఖ్ఖలేదు, అది ఒక సముద్రం.

*—Clarnin Day*

జీవితము బుద్బుదప్రాయం. సుఖానుభూతి ఎంత శీఘ్రంగా పొందడం ఆరంభిస్తే అంత మంచిది.

---

జీవిత పరమావధి ముందుకు సాగడమే.

---

జీవితమనేది ఒక నేపాళం మాత్రవంటిది. ఎవరుకాని దానిని హితవుగా మ్రింగలేరు.

*—Dr Johnson*

చూడగానే 'ఏమోయి మూర్తి యిదేగాదు నీ పెద్దమనిషి తరహా! ఆవైపుకే పోనని నాదగ్గర వట్టుపెట్టుకొని వాళ్ళయింటిలోకి కూడా ప్రవేశించి ఈ జేబురుమాలు ఆమెకు బహుమానంగా యిచ్చావుట చాల్లేనీవ్యవహారం యింతతో కట్టిపెట్టకపోతే మర్యాద దక్కదని బెదిరించి వెళ్ళిపోయాడు కోపంగా రుమాలు మూర్తిముఖం మీద గిరవాటువేసి, మూర్తి ఆ రుమాలుని ఒక ప్రేమానుబంధంగా పరిగ్రహించి జేబులో పెట్టుకొన్నాడు.

మూర్తి విమల యింటిముందరగా వెళ్లేటప్పుడల్లా ఆ జేబురుమాలును ముద్దుపెట్టుకుంటూ నడిచేవాడు. ఒకసారి విమల చూచింది. ఆమెలో ఆవేదన అధికమైంది. తన హృదయం అతనికి తెలిపితేనే కాని అతడు తన వలలో పడడని నిశ్చయించుకొని మరో ఎత్తు ఎత్తింది.

జగ్గరాజు ఆమెను చూచిపోడానికి వచ్చినప్పుడు బుడబుడ నుక్షిం తీస్తూ బాబూగారు! నిన్నరాత్రి ఏం జరిగిందనుకున్నారు అంది.

ఏంజరిగిందన్నా చెప్పన్నా చెప్పు ఇంకా అరాజకంరాలేదు పోలీసులతో చెప్పి వాడిపని పట్టిస్తానుఅన్నాడు రాజు

"నిన్న రాత్రి సుమారు ఎనిమిది గంటలవేళ నేను తలుపులన్నీ వేసుకొని పడుకోడానికి మేడమీదకు ఎక్కాను నిద్రరాకపోతే కాసేపు చదువుకుందామని మనుచరిత్ర తీసి చదువుకుంటున్నాను వెనుకవెంపు తోటలో ఏదో చప్పుడయింది. ఏమిటో చూదామని కిటికీతలుపులు తీసి చూస్తూ ఎవరువారని అదలించితిని కదా నేను 'విమలా'! ఒంటరిగా వున్నావని తోడుగా వుందామని వచ్చాను అంటూ ఆ బొగడిచెట్టు ఎక్కి కిటికీదాకా వచ్చేసాడు కిటి

కీకి వ్రాచలుకూడా లేవు గోపలకు వచ్చేస్తాడేమోనన్న భయంవేసి దిగుతావా దిగవా అని గట్టిగా అరిచాను దానితో దిగిపోయాడు.'' నాకు చాలా భయంగా వుంది బాబుగారు అని వగచింది

వెర్రితల్లీ! వూరుకోమ్మా వూరుకో. నేను వున్నానుకాదూ? అయినా మనయింటిచుట్టూ రెండునిలువుల ఎత్తున గోడలు వున్నాయికదా ఎల్లా దొడ్డిలోకి ప్రవేసించాడా తుంటరి అన్నాడు జగ్గరాజు మనయింటికి పడమరగావున్న యింటికి మధ్యగోడ చాలా చిన్నది ఆయిల్లు పాడుపడివుంది కదూ అందుచేత ఆయింట్లో సులభంగా ప్రవేసించి వచ్చివుంటాడని చెప్పింది. వెర్రి వెంకయ్య జగ్గరాజు యిదిఅంతా నిజమేననుకున్నాడు. దక్షిణ నాయకుడని పేరుగాంచిన శ్రీకృష్ణుడే స్త్రీహృదయం నారికేళపాకమంటే సామాన్యులకు కొరుకుపడుతుందా?

ఆ మరునాడు మూర్తిని కలసికొని జగ్గరాజు విమల చెప్పినమాటలన్నీ చెప్పి ఈసారి నీవావైపునకు వెళ్ళావని తెలిసిందంటే అరదండాలు వేయించేస్తానని ఝడిపించాడు. మూర్తి దాని అంతరార్థం గ్రహించి ఆనాటిరాత్రి పెందరాళే భోజనంకానిచ్చి పువ్వులరంగడులా తయారై విమల జగ్గరాజుతో చెప్పిపంపిన మార్గాన్ని అనుసరించి విమల గృహంలో ప్రవేసించాడు. విమల మూర్తినిచూాలేసరికి పరవశురాలై అతనిని తన బాహువులతో బంధించింది.

మూర్తినిపట్టి అరదండాలు వేయించాలని ఆరాత్రి గుడ్డుబడితి చేతపట్టుకొని విమల యింటిముందు పారాతిరగడం ప్రారంభించాడు జగ్గరాజు. మొత్తంమీద ఆనాడు మూర్తి బంధింపబడ్డాడు. నాటి నుండి నేటివరకు అతనిమీాద ఫిర్యాదీలేదు.

---

# అమృత సూక్తులు

పొగడ్తలకు ఉబ్బిపోయే వ్యక్తి ఆశకు దాసుడౌట నిజము.

—-*Bishop wilson*

* * *

నీ మెదడును చల్లగాను పాదములను పొడిగాను వుంచుకొనుట మంచిది.

మహారాజశ్రీ రావు శ్రీ వెంకట స్వేతచలపతి రంగారావు.

(బొబ్బిలి మహారాజు.)

* * *

ఎవరితోనైనా పోరాడతాను, నేను అన్నది లేదని బుకాయిస్తాను. మోసం చేస్తాను జయిస్తాను కాని నా పొట్టను మాత్రం జయించలేక పోతున్నా. ఎప్పుడుకావాలంటే అప్పుడు ఎంత కావాలంటే అంత ఏంకావాలంటే అవి దాని ముఖాన పడేసినా దానికి తృప్తిఅన్నది కనుపించదు. గౌరవ మర్యాదలతో దానికి పనిలేదు.

—*Emerson*

* * *

జీవితంలో నూతన పరిచయం కలుగనిదినం వృధాఅని నాభావము.

—*Dr. Johnson*

* * *

ఆడదాని అందం, మగవాని చమత్కృతి సరిగా వినియోగించకపోతే సొంతదారుకే ప్రమాదం తీసుకొస్తాయి.

—*Chesterfield*

* * *

ధనమూలమిదం జగత్ అన్నారు పెద్దలు మానవునకు డబ్బు అనేది ఒక ప్రాణంవంటిది. అది ఆరోప్రాణం అంటే బాగుంటుంది. పంచప్రాణాలు పని చేసినా డబ్బు అన్నది లేకపోతే మానవుడు జీవఛ్ఛవమన్నమాటే డబ్బులేని వాని జీవితం రాణించదు.

—*W. Somerset Maughan*

* * *

దుర్బలులే సౌందర్య పిపాసకులు.

—*Milon*

# హిందూ దేశ చరిత్రలో అశ్వములు

నేటి యుద్ధంలో జయాపజయములు విమానబలంపై ఆధారపడి వుంటున్న విషయం లోకవిదితమే.

నేడు విమానబలం జయాపజయములను నిర్ణయిస్తూవున్నట్టే పూర్వకాలంలో అశ్వములు యుద్ధములలో ప్రాధాన్యత వహించాయి.

గుఱ్ఱములయొక్క ప్రాముఖ్యత అతి ప్రాచీనకాలమునాటిది. ఆకాలంలో అశ్వమేధయాగం చేసినవాడే ఘనుడు. అంటే ఒక రాజు ఇతర రాజును తన సామంతునిగా చేసుకొనుటకుగాను ఆ రాజు ఒక పంచకళ్యాణీ గుర్రమునొకదానిని ఏరి దానికి చేయవలసిన పూజలన్నీ చేయించి వదలిపెట్టేవాడు. అది దాని చిత్తము వచ్చినట్టు తిరిగివచ్చేది. దానిని వెన్నంటి ఆ రాజు సైనికులు పోతూవుండేవారు, ఎవరైనా దానిని పట్టినచో వారిని ఓడించి ఆ గుఱ్ఱమును విడిపించడమే ఆ అశ్వరక్షకుల విధి. ఆవిధంగా ఆయారాజును లోబరచుకునేవారు.

ఎవని గుఱ్ఱము అన్ని దేశములు నిరాఘాటంగా తిరిగివస్తుందో ఆతడే రారాజు. అంటే అశ్వమేధయాగమునకు నిర్ణయింపబడిన గుర్రము ఏ దేశంలో కాలు పెడితే ఆ దేశమునకు అది అల్‌టిమేటం వంటిది అన్నమాట. దానికి ఆమోదించని రాజుతో ఆ అశ్వరక్షకులు పోరాడి ఓడించేవారు లేకపోతే ఓడిపోయేవారు.

పూర్వం అశ్వమేధయాగము ధర్మరాజు శ్రీరాముడు మొదలైనవారు అనేకమంది చేసారు. వారు పురాణ పురుషులు.

తరువాత మన హిందూదేశ చరిత్రలో పేరుకాంచిన పుష్యమిత్రుడు, గుప్తవంశములోని సముద్రగుప్తుడు, ఒకటవ కుమారగుప్తుడుకూడా అశ్వమేధయాగం చేశారు. అశ్వమేధయాగమంటే ఆ రోజులలో ఒక గొప్ప జాతీయ ఉత్సవం.

గ్రీకుల దండయాత్ర సమయంలో హిందూదేశపురాజు పౌరస్‌నకు అపజయం తీసుకొనివచ్చినది అతని గజసమూహము. అతనితో ఎదిర్చి పోరాడి విజయముకాంచినది అలెగ్జాండరుయొక్క అశ్వదళము.

ఆ అశ్వదళంలో పేరుపొందిన గుఱ్ఱము అలెగ్జాండరు ఎక్కిన 'బుసిఫలాస్' అనునది.

ఆగుఱ్ఱము చాలా తెలివైనది ఒక అలెగ్జాండరుతప్ప యితరులెవరినీ సమీపింపనిచ్చేదికాదు. అలెగ్జాండరు సమీపింపగానే వంగి అతన్ని ఆరోహింపనిచ్చేది.

పౌరసుతో జరిగేయుద్ధంలో అలెగ్జాండరు చాలా తీవ్రంగా పోరాడుతున్నాడు. ఆయుద్ధం మహాఘోరంగా జరుగుతోంది అలెగ్జాండరు గుఱ్ఱమునకు బల్లెపుపోటు తగిలింది. రక్తము కారుతూవున్నా అది పరుగెత్తలేదు పడిపోలేదు అలెగ్జాండరుకి ప్రమాదం కలుగుతుందని దానికి తోచగానే రణరంగంనుంచి చంగున బయటకు దూకి దూరంగా పారిపోయి తన యజమాని ప్రమాదంనుండి బయటపడ్డాడని దానికి నమ్మకం కలుగగానే అది పడిపోయి ప్రాణం విడిచిపెట్టింది. విచారమంటే ఏమిటో ఎరుగని అలెగ్జాండరు వీరుని హృదయం తరుక్కుపోయింది. ఆ స్థలంలో దానిపేరట ఒక నగరం కట్టించాడు అలెగ్జాండరు ఆనగరం పేరు ఆగుఱ్ఱంపేరే. దానిని 'బుసిఫలాస్,' అంటారు.

రాణా ప్రతాపుని చరిత్రలో కూడా గుఱ్ఱము ప్రముఖస్థానం వహిస్తోంది రాణాప్రతాపు ముఘల్ చక్రవర్తిసైన్యంతో హాల్‌డిఘాట్‌వద్ద యుద్ధము చేసాడు,

అందులో అతనికి విజయం చేకూర్చినది అతని గుర్రము చౌటిల్. కాగా అది చనిపోయిన స్థలంలో దాని పేరట ఒక నగరం కట్టించాడు రాణాప్రతాపుడు. నేటికీ ఆ గుర్రము మొఘల్ చక్రవర్తి కుమారుడు సలీమ్ ఎక్కిన ఏనుగుపై ముందరకాలు మోపి రాణాప్రతాపుని సలీమ్ సమీపమునకు కొంపోయినట్టి శిలావిగ్రహం. ఆ నగరంలో వున్నది.

దాని తరువాత చెప్పతగినది రాణా అమీర్ సింగ్ యొక్క 'బాజ్ బహదర్' అనే అశ్వము. యజమాని ప్రాణరక్షణకై తన ప్రాణములను బలియిచ్చిన విశ్వాసంగల జంతువు. రాణా అమీర్‌ని అవమానించడానికి షహజహాన్ అతనిని తన ద్వారపాలకునిగా నియమించాడు. అట్లు చేయడానికి యిష్టం లేనిచో 7 లక్షలరూప్యములను జరిమానాగా యిమ్మని శాసించాడు.

రాణా ద్వారపాలకునిగా వుండలేదు కాగా జరిమానా వసూలు చేయడానికి సాల్ బాట్‌ఖాన్ అనే వానిని పంపించాడు. రాణా అతనిని హత్యచేశాడు. చక్రవర్తి కోపోద్దీపితుడై అతనిని పట్టవలసినదిగా సైనికులను పంపించాడు. ఆ సమయంలో రాణా తన గుర్రము నెక్కి కోటబురుజుమీదనుంచి దూకి పారిపోయాడు. ఆ దూకడంలో పేగులు తెగి గుర్రము చనిపోయింది. కాని యజమానిని రక్షించితిని కదా అన్న సంతోషంతో చనిపోయింది.

అల్లాఉద్దీను నిర్బంధంలో వున్న చిత్తూరు దుర్గముయొక్క భీమసింగుని రక్షించినది పద్మిని పంపిన గుర్రమే.

జయచంద్రుని కుమార్తెయగు రాణీ సంయుక్తను పృథ్వీరాజును జయచంద్రుని దేశమునుండి రెప్పపాటుకాలంలో ఢిల్లీనగరం చేర్చినది అశ్వమే. ఆనాటి పృథ్వీరాజ జయచంద్రుల మనస్పర్థలే మన దేశమును అన్యాక్రాంతంచేసాయి. ఆపీడ నేటికీ మనలను పట్టి పీడిస్తోనేవుంది.

ఔరంగజేబు జేబులో చిక్కిన శివాజిని తప్పించింది రామసింగ్ ఏర్పరచిన గుఱ్ఱమే.

మంగోలియన్ నాయకుడు జింగిస్‌ఖాన్ ప్రపంచమునంతను హడలుగొట్టి చైనా, కివి, బుఖారా, సోమర్‌ఖండ్, మధ్య ఆసియా, ఆఫ్ఘనిస్థాను, ఇండియా మొదలగు ప్రదేశాలను అచిరకాలంలో జయించుటకు కారణము అతని గుఱ్ఱమే. ఆ రోజులలో గుఱ్ఱాలే సైనికులను అదిత్వరితంగా ఒక చోటినుంచి ఇంకొక చోటికి తీసుకుపోయేవి. ప్రపంచానికంతకు జెంగిస్‌ఖాను అధికారిఅయినా అతనికి యజమాని అతని గుర్రమనక తీరదు.

షహజహాన్ కుమారులు అతని మరణాంతరం సింహాసనము కొరకు పోరాడసాగిరి. అందులో దారా అపజయం పొందడానికి కారణం అతడు ఏనుగును విడచి గుఱ్ఱము నెక్కుటే అంటారు. దారా సైనికులకు ఔరంగజేబు సైనికులకు ఘోర సంగ్రామము జరుగుతున్న సమయంలో తన సైనికులను వురికొల్పవలె నన్న ఉత్సాహంతో దారా తన ఏనుగును దిగి అశ్వారూఢుడై రణప్రాంగణము చొరబడ్డాడు. ఏనుగుమీద తమ యజమాని కానుపించనందున సైనికులు వెనుకంజ వేసారు. దానితో ఔరంగజేబును విజలక్ష్మి వరించింది. దారా ఏనుగుమీదనే వుంటే హిందూదేశచరిత్ర వేరుగా వుండివుండేది.

1857 లో బయలుదేరిన విప్లవజ్వాలలను అణచి తన దేశమును అన్యాక్రాంతం కాకుండా కాపాడుకొనుటకు జానసీ లక్ష్మీబాయికి అపారమైన సేవచేసినది ఆమె వాహనముగానున్న గుఱ్ఱమనే చెప్పాలి.

ఆంధ్ర రాజభక్తులలో అగ్రగణ్యుడగు యాచమనాయునికి ప్రాణదానంచేసినది గుఱ్ఱమే. ఈవిధంగా పూర్వకాలంలో చరిత్రనుకూడా తారుమారు చేసినవి గుఱ్ఱములు. అవి నేడుకూడా యుద్ధంలో అంత ప్రధాన్యత వహించకపోయినా రష్యారంగంలో ప్రముఖ స్థానమునే వహిస్తున్నాయి. రష్యాయుద్ధం ఒక్క విమానబలంమీదనే కాకుండా అశ్వదళంమీద కూడా కొంత వుండవచ్చును.

# దయచేసిగడ్డితినండి

రచయిత:

## మహేంద్రుడు

పూర్వం మన దేశంలో గడ్డి తినడమంటే నీచంగా చూచేవారు. ఎవడేనా నీచమైన కార్యమేదేనా చేస్తే వానిని 'గడ్డితిన్నాడు' అని చులకనగా అనేవారు. కాని ఈ రోజులలో గడ్డితిన్నవాడే ఘనుడు. అందులోను మరీ పచ్చగడ్డి తిన్నవాడు మరీ ఘనుడు, పశ్చాత్త్యుల పుణ్యమా అంటూ మనచేత గడ్డి బాగా తినిపిస్తున్నారు. అందులో ఏవేవో విటమినులున్నాయని ఆశలు పెట్టి మనలను పూర్తి దాసులనుచేసుకొని నానా గడ్డి కరిపిస్తున్నారు. నిజంగా ఈ కాలంలో గడ్డి తినేవాడే గొప్పవాడౌతున్నాడు. తినేవాడే కాదు మనచే నానాగడ్డి తినిపించి అమెరికన్ వర్తకులు కొందరు కోటీశ్వరు లవుతున్నారు కూడాను.

అమెరికాలోని కల్‌నల్ డబ్ల్యు. జి. మేకన్‌డ్రిక్ అనే వర్తకుడు ఓన్‌టారియోలో 300 ఎకరముల ప్రదేశంలో గడ్డిబీడు పెంచి, ఆ గడ్డిని పొడిగాచేసి డబ్బాలలోకి ఎత్తి "డిహైడ్రేటెడ్ ఆల్ ఫలాఫ్ మీల్' అనే పేరుతో ఆహారవస్తువుగా అమ్ముతున్నాడు. ఆగడ్డి సాలీనా 2500 టన్నులు అమ్ముడవుతోంది. అయితే గడ్డికింత ప్రాముఖ్యత ఎందుకు వచ్చిందంటారా?

గడ్డిలో అనేకమైన ఓషధులు వుండటమే కాకండా 'కె' విటమిన్ అనే ఒక అమూల్యమైన ఓషధి అపారంగా వుంది. కె విటమిన్ రక్తమును గట్టిపరచి కండరములను పెంపొంద చేస్తుంది. కండరములు బలిష్టంగా పెరిగితే ఆరోగ్యం వృద్ధి అవుతుంది. ఆరోగ్యమే మహాభాగ్యంకాదూ? అందుచే అపారమైన ధనం ప్రాప్తిస్తుంది. అందుచేత గడ్డి తినేవాడు గొప్పవాడవుతాడనడం నిస్సంశయం. గడ్డితినేవాని తిండికర్చు కూడా తగ్గిపోతుంది.

ఒక పౌను గడ్డిలో ఒక పౌను పండ్లలోగాని కాయకూరలలో కాని వుండే ఏవిటమినులకన్నా ఇరువదిరెట్లు ఏ విటమిను వుంది.

అలాగే బి, సి విటమినులు కూడా అధికంగా వున్నాయి. అన్నిటికన్నా ముఖ్యమైనది కేవిటమిను అపారంగా వుంది. అందుకనే పచ్చగడ్డి తినే ఆబోతు మూపురం చట్టలు బలిష్టంగా వుంటాయి. పచ్చగడ్డి తినే ఆవులు బాగా పాలుయిస్తాయి.

గడ్డిలో అనేకరకాలు వున్నాయి. ఏ గడ్డితిన్నా మంచిదే గరికగడ్డి, రేగడిదుబ్బు, తుంగ, రెల్లు మొదలైన రకరకాల గడ్డలు వున్నాయి. అందులో గరిక చాలా శ్రేష్టమైనది.

అసలు మన దేశంలో గరిక పచ్చడి తిని ఒక మహారాజు ఒక అగ్రహారం దానం చేశాడని ఆ గ్రామాలకు గరికలవలసఅని పేరు వుందని ఒక యితిహాసంకూడా వుంది.

అంటే షడ్రసోపేతంగా భుజించినా తృప్తిపడని మహారాజుకూడా పచ్చగడ్డిపచ్చడికి సంతృప్తిపడ్డాడంటేనే దాని విశిష్టత వేరు పేర్కొన అవసరంలేదు.

ఈ యుద్ధకాలంలో ఆహార పదార్థములు సరిగా సరఫరా కాని పరిస్థితులు ఏర్పడుతున్నాయి. కాబట్టి గడ్డి తినడం తప్ప వేరే గత్యంతరంలేదు. అందుచేత గడ్డి తినేవాళ్ళని చులకనగా చూడక గడ్డి తినడం నేర్చుకోవడం మంచిది.

ముఖ్యంగా గడ్డి సైనికులు సేవించవలసిన ప్రధాన ఆహార వస్తువు అనకతప్పదు. యుద్ధంలో సైనికులకు గాయములు తగలడం సహజం. గాయపడి రక్తం స్రవించిపోతే నీరసించిపోయి పడిపోతారు. కానిగడ్డితింటేగాయంపడినా రక్తం

ధారాపాతంగా శ్రమించిపోము. గాలి తగలగానే పేరుకుపోయి రక్తస్రావమును అరికట్టివేస్తుంది. ఆ శక్తి నిచ్చే కెవిటమిను గడ్డిలో వుందని ఇదివరకే మనవిచేసాను. పశువు గడ్డివిస్తారంగా తింటుంది కనుకనే కాకులు పొడిచి పుండు చేసినా రక్తం కారదు. అట్టకట్టుకుపోతుంది.

మానవుడు ద్విపాద పశువుగా పరిగణింపబడుతున్నాడు కనుక గడ్డి తినడంలో తప్పేమీ లేదు. దాని యొక్క ఘనత తెలుసుకొని తినడం చాలా మంచిది.

తరిచి తరిచి చూస్తే రాముడు నానాగడ్డితినే రావణాసురుని చంపినట్టు, పాండవులు నానాగడ్డి కరిచే కౌరవులను హతమార్చారని తోస్తుంది, అరణ్యంలో గడ్డి తినబట్టే భీముడంత బలిష్టుడైనాడు కాబోలు.

అమెరికాలో గడ్డితినే స్వతంత్రత సంపాదించారు. ఇప్పటికికూడా టొరెంటోలోని 'సింతటిక్ ట్రేడింగ్ కంపెనీవారు గడ్డిని కెసాన్' అనే పేరుతో మాత్రలుగా చేసి అమ్ముతున్నారు.

మొత్తంమీద గడ్డితినడం ఒక నీచకార్యంకాదని దానిని ఒక నీచ కార్యంతో జతచేసి మన పెద్దలు మనలను పెడదార్లను పెట్టారని చెప్పక తప్పదు. మన పెద్దలు గడ్డి తినకే స్వతంత్రం కోల్పోయారు. కాబట్టి గడ్డితినేనా శత్రువుతో పోరాడి స్వతంత్రత సంపాదించమని నా మనవి.

# గడ్డితినిపించే అమెరికా సంఘం

పచ్చగడ్డియొక్క ఆహారపువిలువను పరిశోధించి ప్రజలచే బాహాటంగా ఎవరు గడ్డిని తినిపిస్తారో వానికి బహుమానమీయుటకుగాను అమెరికాలో ఒక సంఘమేర్పడి ఒక మిలియన్ డాలర్లు పోగుచేసింది.

ప్రకృతిలో దొరికే ఆహారవస్తువు లన్నిటియందు గడ్డి శ్రేష్టమైనదని పశువులాగ మానవుడుకూడా గడ్డితిని బ్రతికితే ఆహారవస్తు పరిశోధకులలో గొప్ప విప్లం వస్తుందని వారి మతం.

అమెరికన్ కెమికల్ సుసైటీ పచ్చగడ్డిని పరిశోధించి విటమిన్లు అందులో అపరిమితంగా వున్నాయని సిద్ధాంతీకరించింది.

ఒక పౌను పచ్చగడ్డిలో ఒక పౌను పండ్లలోకన్నను ఒక పౌను కాయకూరలలోకన్నను 30 రెట్లు విటమినులు వున్నవని. పంద్రెండు పౌనుల ఎండుగడ్డిలో 340 పౌనుల కాయకూరలు, పండ్లలోను వుంటే విటమినులు వున్నాయని నిరూపించారు పరిశోధకులు. అంటే మానవుడు పండ్లు కాయలు సంవత్సరం పొడుగునా తిని జీర్ణంచేసుకునే విటమినులకన్నా గుప్పెడు గడ్డితింటే ఆ విటమినులన్నీ లభిస్తాయన్నమాట. గడ్డి తినడం అంటే సామాన్యునికి నచ్చదు. అది అంత రుచికరంగానూ వుండదు.

గడ్డి తినకపోవడంవల్ల తమ ప్రజలు బలహీనులై పోతున్నారని మొరపెట్టుకుంటోంది అమెరికా. దానివల్ల దేశరక్షణకు భంగం కలుగుతుందని భయపడుతోంది. అందుచే అమెరికాలో కొన్ని సంఘాలు కలసి ఒక ఫుడ్‌డిఫెన్సు ప్రోగ్రామ్ ఒకటిచేసి ప్రజలచేత గడ్డితినిపించడానికి విశ్వప్రయత్నం చేస్తున్నవి.

# జగన్నాథపండితరాయలు

సాహిత్యసుధారసజ్ఞులలో నగ్రేసరుడును, అలంకారశాస్త్రమునకు మకుటాయమానమైన రసగంగాధరము రచించి, వివేకశీలురగు విద్వాంసులచే వందిత పాదసరోజుడునైన జగన్నాథ పండితుని యెరుగనివారు, సంస్కృతసాహిత్యామృత పిపాసులలో నుండబోరు.

ఆంధ్రదేశమున నుత్తమ బ్రాహ్మణ వంశాభిజాతుండై, సమస్త విద్యలయందు బాండిత్యము నార్జించి, పండిత ప్రకాండుల కావాసభూతమైన కాశికాపురియందుంగూడ నప్రతిమమగు కీర్తినార్జించి దివంగతుడై నప్పటినుండియు, కాశీనివాసులచే బండితరాయవర్ధంతి జేయబడి యశఃకాయ జీవియగు బండితరాయని తలంపు—ఆంధ్రులకు గర్వింపదగిన యంశము.

ఆంధ్రదేశములో గోదావరీ మండలమున వేగినాటిశాఖీయుడగు భూసురుడైన పేరుభట్టు- అను మహాపండితుడుండెను. ఆయన కాశీయందు - జ్ఞానేంద్రభిక్షువువలన వేదాంత శాస్త్రమును, మహేంద్రపండితునివలన గౌతమ కాణాద తర్కశాస్త్రములను, ఖండదేవునివలనం బూర్వమీమాంసాశాస్త్రమును, వీరేశ్వరపండితునివలన మహాభాష్యమును పఠించెను. ఈయనకు లక్ష్మియను ధర్మపత్ని. వారికి జగన్నాథుడుదయించెను. మహాగురువైన తండ్రివద్దనే జగన్నాథుడు సకలవిద్యల నభ్యసించెను. *

ప్రాప్తయౌవనుడగు జగన్నాథపండితుడు యథేచ్ఛ దిరుగుచు యాదృచ్ఛికముగ ఢిల్లీనగరముం బోయి యచట దేవేంద్రభోగభాగ్యములచే దులతూగుచున్న "షాజహాను, అను యవన చక్రవర్తి యాస్థానమునం బ్రవేశమొందెను. క్రమముగ స్వీయ పాండిత్యగరిమ బ్రకాశింపగనే చక్రవర్తికిగూడ పండితునియెడ గౌరవము వృద్ధినొందుచుండెను. పిమ్మట ఆసఫ విలాసమను నాఖ్యాయిక రచించుటచే, తద్దర్శనాభివృద్ధాధికాదరాభిమానుడగు షాజహానువలననే—'పండితరాజ' బిరుదమునొంది, జగన్నాథపండితుడు పూర్వవయసు నచటనే గడపెను.

షాజహాను చక్రవర్తి 1628 వత్సరమున, బట్టాభిషిక్తుడై, 1658 వత్సరమున నౌరంగజేబను స్వపుత్రునిచే గారాగార బద్ధుడయ్యెను. 1666 న మృతినొందెను. పండితరాజుగూడ నపరవయసున * వారణాసియందు బరమేశ్వరుని యారాధింపుచుం గాలముగడపెను. పండితుని కాలముగూడ 17-వ శతాబ్ద మధ్యభాగమని వ్యక్తమగుచున్నది.

జగన్నాథ పండితుని గురించిన కింవదంతులు:—

జగన్నాథుడు త్రిలింగదేశమునుండి జయపురమునకు వెళ్ళి యచట ననేక విద్యార్థులకుం బాఠములం జెప్పుచుండ, ఢిల్లీనుండి వచ్చిన కాజీ యను యవన పండితుడు, జగన్నాథునిం బరీక్షింపనెంచి, కుశాగ్రీయధిషణుడగు పండితరాజు తన్మతగ్రంథముల స్వయముగ బఠించి వాదమున నాతనినే జయించి పంపెను. అంత ఢిల్లీచక్రవర్తి కాజీ పండితునివలన జగన్నాథుని పాండితీ మహిమవిని తన యాస్థాన

* రసగంగాధరాది తద్విషయ ప్రమాపకములు:—

1, శ్రీమజ్జ్ఞానేంద్రభిక్షోరధిగతసకలబ్రహ్మవిద్యాప్రపంచః
కాణాదీరక్షపాదీరపిగహనగిరో యోమహేంద్రాదవేదీత్.
దేవాదేవాధ్యగీష్టస్మరహరనగరే శాసనం జైమినీయాం
శేషాంకప్రాప్తశేషామలభణితిరభూత్సర్వవిద్యాధరో యః

2, పాషాణాదపి పీయూషంస్యందతే యస్యలీలయా ।
తంవందే పేరుభట్టాఖ్యం లక్ష్మీకాంతం మహాగురుం॥

ఇతర కథాంశములకు ప్రమాణముల గ్రంథవిస్తరభీతిచే నుగ్గడింపలేదు.

* భామినీ విలాసాంతమున—'సంప్రత్యంధక శాసనస్య నగరే తత్త్వంపరం చింత్యతే' అని యున్నది.

పండితునిగాఁ జేసికొనెననియు, అచటనే యొక యవనకన్యకయం దనురక్తుఁడై యౌవనమంతయు నచటనే గడపి జగన్నాథుం డపరవయసునఁ గాశికిఁ జేరెనని కొందరు.

జగన్నాథుఁడు తండ్రికడ సమస్త శాస్త్రముల నభ్యసించిన తోడనే పర్యటనముఁ జేయుచు ఢిల్లీ నగరిఁజేరి, యచట ప్రాతఃకాలముననే యమునానదీ స్నానమున కేగెను. అచట స్నానముజేయుచుండ గట్టుపై యవనుఁడు యవనిని బలవంతముచేయ వారిద్దరికి వివాదముజరిగెను. అంత నీయన నియమము దీర్చికొని యొక బ్రాహ్మణగృహమునకుఁ బోయి యచట భుజించియున్న సమయమున, ఢిల్లీ ప్రభువుచేఁ బిలువఁబడి, నదియొద్దున వివదించుకొనిన వారినిఁ జూపుచు, వీరి వివాద వాద వాక్యముల సాక్ష్యమివ్వగలవాయని యడుగ నట్లేయని యవన భాషాగతములైన వారి వివాద వాక్యములఁ బూస గ్రుచ్చినట్లుఁ జెప్ప భాషా పరిచయములేకయు నిట్లు పలుక శక్యమాయనితలచి, యవనభాషీయమగు నొక గ్రంథములో పది పేజీల నొకమారు జదివి యప్పగింపమని రాజాజ్ఞచేయ, జగన్నాథుఁ డట్లే యనువదించెను. అంత నీతని యేకసంతగ్రాహిత్వ సూక్ష్మగ్రాహిత్వములకు ఢిల్లీ నరేంద్రుఁ డచ్చెరువంది, యభిలషితముఁ దెలుపమనగా. జగన్నాథుఁడు తత్పుత్రిక నభిలషించెననియు, నవమన్మథా కారుఁడగు జగన్నాథుని యంతఃపురమునుండిచూచి, తత్పుత్రికయు ప్రేమించుటచే నిద్దరికి పాణిగ్రహణము జరిగెననియు, కొంతకాలమునకుఁ బ్రియా వియోగ జనిత విరాగ భావముకలవాఁడై జగన్నాథుఁడు కాశీచేరెనని కొందరు.

పండిత రాజునకు యవనీ సంసక్తి నీ క్రింది శ్లోకములు ధ్రువపరుచు ననుటకు పండితరాజకృతములే యనుట—

1. యవనీ నవనీతకోమలాంగీ శయనీయే యదినీయతే కదాచిత్
అవనీతలమేవ సాధుమన్యే నవనీమాఘవనీవినోదహేతుః

2. యవనీరమణీ విపదశ్శమనీకమనీయతమా నవనీతసమా
ఉహిఊహి వచోమృతపూర్ణముఖీ సనుజగతీహాయదంకగతా.

3. నయాచేగజాలిం నవావాజిరాజిం నవిత్తేషుచిత్తంమదీయం కదాపి
ఇయంసుస్తనీమస్తకన్యస్తహస్తాలవంగీకురంగీ దృగంగీకరోతు.

ఈతఁడు కాశీపురిఁ బ్రవేశించినతోడనే, వైదికాచార నిష్ఠాగరిష్ఠుండును, అద్వైతమతస్థాపన జేయుటచే నపరశంకరుండునైన నప్పయ దీక్షితుఁడు జగన్నాథుని దుస్సంగునిగా నెరిగి, యతని యమోఘపాండిత్యము గణింపక సర్వవిషయముల బాహ్యునిఁజేసెను. జగన్నాథుఁడు వీరలయెడ కినుకవహించి తన స్నిగ్ధబృందముతోను, శిష్యబృందముతోను కాలము గడపుచు రసగంగాధరమను నలంకార గ్రంథము రచించి, యచ్చటచ్చట నసమంజసములగు ప్రాచీన మతముల ఖండించెను.

అందును సమకాలికుఁడై యలంకార శాస్త్రమునఁగూడ నసదృశ విమర్శకుఁడైన నప్పయదీక్షితుని మతమును దోషబాహుళ్యగ్రస్తమని సయుక్తిగా నిరూపించి, ద్రవిడ శిరోమణియనియు, 'అప్పయ దీక్షితేనయదుక్తం తత్తుచ్ఛం' అని యిట్లనేక విధములుగ నాతని, తన్మతమునుగూడ దూషించి చాలవరకు తన కోపము దీర్చికొనెను. క్రమముగ విమర్శకులగు విద్వాంసుల మన్ననకు పాత్రుఁడయ్యెను.

మఱియు భట్టోజి దీక్షితకృతమగు మనోరమ యను సిద్ధాంతకౌముదీ వ్యాఖ్యానమునకు 'కుచమర్దని' యను ఖండన గ్రంథము రచించుటచే వ్యాకరణమునగూడ నీతనికి యనుపమమగు పాండితీ ప్రతిభ కలదను విషయము విమర్శకులగు పండితులకు తెలియకపోదు.

ఇంక నీయన రచించిన గ్రంథములు—అమృతాలహరీ, ఆసఫవిలాసము, కరుణాలహరీ, చిత్రమీమాంసాఖండనం, జగదాభరణం, పీయూషల

హారీ, ప్రాణాభరణం, భామినీ విలాసము, మనోరమాకుచమర్దనం, రసగంగాధరము, సుధాలహారీ, యమునావర్ణనము, లక్ష్మీలహారీ; అనునవి.

తన యంతకాలమున—'నద్యైర్వారగతి ప్రదేత్య ధనుర్యైస్స్వకీయాపగేత్యు దారతరసిద్ధిదేత్యఖిలసిద్ధ సంఘైరపి, హారేస్తనురితి శ్రీతా మునిభిర స్త సంగైరియం తనోతు మమశంతనో స్సపదిశంతనో రంగనా' ఇత్యాది శ్లోకములచే స్తుతింపఁబడిన గంగానది, శ్లోకమున కొక మెట్టు పైకెక్కి తనయందు లీనునిఁ జేసికొనుటచే పండితరాయని పవిత్రత వెల్లడింపబడెను,

అంతట తన్మహిమా విశేషమునకు విస్మయమంది, యదిమొదలు పండితరాయవర్ధంతిఁ జేయుచు, గంగాభక్తులు గంగాలహారి జదువుచునుండిరి.

అలంకారశాస్త్రమున నీయనకుఁగల ప్రతిభ స్థాలీపులాకన్యాయముగఁ బరిశీలింతము.—

"తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునః క్వాపి" అని కావ్యప్రకాశాదులయందు శబ్దార్థములు రెండును కావ్యమని మమ్మట భట్టాదులు లక్షణము వ్రాయ "రమణీయార్థ ప్రతిపాదకశ్శబ్దః కావ్యం—రమణీయార్థ ప్రతిపాదకమగు శబ్దమే కావ్యమని చెప్పి; కావ్యము గట్టిగఁ జదువబడుచున్నది; కావ్యమువలన నర్థము తెలియుచున్నది. కావ్యము వింటిని యర్థావగమము కాలేదు.' ఇత్యాది వాక్యములచే శబ్దవిశేషమునకే కావ్యత్వమని నిర్ణయించెను. ఇంక నిట్లే రసగంగాధరమంతయు మీమాంసశాస్త్ర విమర్శవలె క్రొంగ్రొత్త విషయముల నిమిడియున్నది.

'వింపతీవతమోంగని'— యనునదియు త్వేవిషయందు విమర్శింపుచు— * 'భావప్రధాన మాఖ్యాతం ఇత్యత్ర భావనార్థకో ధాతుః - ఇత్యర్థకరణాన్న విరోధః. నచవైయాకరణ మత విరోధో దూషణ మితివాచ్యం. స్వతంత్రత్వేనాలంకారికతం త్రస్య తద్విరోధస్యా దూషణత్వాత్. ప్రపంచ యిష్యతే చైతదధికము పరిష్టాదితి ప్రకృతమను సరామః' ఈ వాక్యములచే నలంకారశాస్త్రము స్వతంత్రమని, మరి యేయితర శాస్త్రమునకు పుచ్ఛభూతము కాదని కంఠోక్తమగుచున్నది.

జగన్నాథపండిత నరేంద్రుని విషయములో సహృదయ విమర్శనీయ మొండు కలదు.

రసగంగాధరమున— యోగరూఢి శబ్దవిషయము విమర్శింపుచు 'శబ్దాదేవప్రమితః' అని యుత్తర మీమాంసా సూత్రము ప్రకృత సమర్థనమున కుదహరించి, వేదాంతశాస్త్రమున తనకుఁగల యనుభవ పాండిత్యము వెల్లడించెను.

మఱియు రూపకాలంకార ప్రకరణమున — 'యథాశరమయంబర్హిః' ఇత్యేతద్విషయాతిరిక్తః 'కుశమయంబర్హి' ఇత్యస్యపి—అని పూర్వమీమాంసయందలి విశేషసామాన్య విధుల సాదృశ్యముచేఁ బ్రకృతార్థము సమర్థించెను. దాన పూర్వ మీమాంసా శాస్త్రమునఁగూడ పండితునికి ప్రతిమమగు పాండిత్యముకలదని విమర్శకులగు విద్వాంసులకుఁ దేటతెల్లము.

కర్మమార్గముపదేశించునది పూర్వ మీమాంసా శాస్త్రము. వేదాంతమార్గ ముపదేశించునది యుత్తర మీమాంసాశాస్త్రము. ఇట్టి వానియందు గొప్ప పాండిత్యము నార్జించిన మహనీయుఁడు యవనీ సాంగత్యము కలవాఁడనుట సాహసము. సార్వజనీనమగు నిట్టి కింవదంతులు — 'కామాంధానాం యుక్తాయుక్త వివేకశూన్యత్వాత్ — కామాంధులు యుక్తాయుక్త వివేకశూన్యులగుటవలన'—అనిమల్లినాథుఁడు మేఘసందేశ వ్యాఖ్యానమునఁ జెప్పినట్లు, యౌవనమదాంధత యట్లు చేయునేమోయను సందియముగూడఁ గల్గుచున్నది.

ఇట్టి జనశ్రుతుల విషయమునఁ బ్రమాణములు లేనందున 'సతాంహి సందేహపదేషువస్తుషు ప్రమాణమంతఃకరణ ప్రవృత్తయః' అని కాళిదాస మహాకవి చెప్పినట్లు సత్పురుషుల యంతఃకరణ ప్రవత్తులే —ఏతత్సందేహ నిర్ణాయకములగు గాక.

—ములగాల సేతుమాధవస్వామి.

* ఏతద్వాక్యార్థ వివరణము గ్రంధవిస్తరభీతిచేమానితిని.

# నిమ్మపండ్లు : ప్రాధాన్యత

రచయిత :

శ్రీ ప్రకాశచంద్ర శతపతి

మనుజులకు ఆరోగ్యమును సమకూర్చే పండ్లన్నిటిలోనూ- నిమ్మపండ్లు చాలా శ్రేష్టమైనవి. మనుజులకు వచ్చు సాధారణ వ్యాధులు- అంటే, మలబద్ధకం. అజీర్ణము, మొదలగు వ్యాధులబారినుండి, ఏ డాక్టర్ సహాయ్యము లేకండానే, నిమ్మపండ్ల సేవనవలన తప్పించుకోవచ్చు.

## గుణము

ఈ పండ్లయందు — పొటాషియం, క్యాల్సియం, మ్యగ్నీషియం, ఫాస్ఫరస్, మాలిక్ యాసిడ్ మొదలగు అమూల్యమగుపదార్థములును, ఎ. బి. సి. విటమిన్లు (జీవాణువులు) ఇమిడి ఉన్నాయి. అందు—

పొటాషియం ఉండుటవలన—రక్తమును శుభ్రపర్చి, కండరముల నభివృద్ధి పర్చును. నరములకును, మెదడునకును, బలమును ఆలోచనాశక్తిని యిచ్చును.

క్యాల్సియం ఉండుటవలన, దంత వ్యాధులను రానీయక, దంతములకు మంచి పటుత్వము నిచ్చును. యెముకలకు బలమును కల్గజేసి, కష్టసహనశక్తిని వృద్ధిపరచును..

మ్యగ్నీషియం ఉండుటవలన— పండ్లకు పదును నిచ్చును శరీరములోన నసంఖ్యాకములైన కణములను జనింపజేసి, ఆరోగ్య రక్షణములకు తోడ్పడును. మలబద్ధమును పోగొట్టును.

ఫాస్ఫరస్ ఉండుటవలన— ఊపిరితిత్తులను పరిశుభ్రపరచి సరిగా పనిచేయునట్లు చేయును. కఫమును హరించి, ఉబ్బసము, దగ్గు, క్షయ మొదలగు వ్యాధులను శాంతింపజేయును.

మాలిక్ యాసిడ్ యుండుటవలన— తామర, గజ్జి మొదలగు చర్మ వ్యాధులను పోగొట్టును.

ఎ.బి.సి. విటమిన్లు యుండుటచే— చిక్కిన శరీరమును బలపర్చి, శరీరమును పెరగనిచ్చును, రక్తమును చెరుపుచేయు పదార్థములను బయటికి త్రోసివేయును. అంటురోగముల నంటనివ్వక చర్మమును తళతళ మెరయునట్లుంచును. ఆకలిని వృద్ధిచేయించును. అతిసారము, కాళ్లు చేతులు వాచుట, ఇగుళ్ళనుండి రక్తము స్రవించుట, మొదలగు వ్యాధుల బారి నుండి రక్షించును శరీరమునందలి రక్తములోగల మాలిన్యమును బయటికి త్రోసివేయును.

చర్మవ్యాధులలో—యీ నిమ్మ తొక్కలను, వేసి, రుద్దినయెడల చర్మవ్యాధులు హరించును. ముఖమునకు రుద్దిన చర్మమునకు కాంతిని, నరములకు బలమును యిచ్చును.

నిమ్మరసమును కొబ్బరిపాలలో కలిపి గిలకొట్టిన ఒక విధమైన వెన్నలాంటి పదార్థమువచ్చును. దానిని తలకు రాసి మర్దనచేసిన ఉష్ణమును హరించి, శిరోజములను పెంచును. చిడుము మొదలగు వ్యాధులను నివారించును. పై పదార్థములో వెన్నకలిపి ముఖమునకు రాచిన మొదటిరకపు స్నోవలె నుండును. శరీరమునకు రాచిన, చర్మములోని మురికి నంతయూ, బహిర్గతమొనరించును. దీని రసము వేడినీళ్ళలోకలిపి, పుక్కిలించిన, నోటిలోగల దుర్గంధములు హరించును. ఉదయము, సాయంత్రము నిమ్మరసమును నీళ్ళలో కల్పి త్రాగినయెడల ఆహారనాళమునందలి మాలిన్యమును హరించును వెచ్చని నీళ్ళలో కల్పి త్రాగిన మలబద్ధకమును పోగొట్టును. నిమ్మకాయతొక్కలను పండ్లకు (దంతములకు) రుద్దిన యెడల పండ్లయందుగల మురికిని పోగొట్టి పండ్లకు బలమునిచ్చును. అన్నములో దీనిరసము కలుపుకొని తినిన ఆహారము తేలికగా జీర్ణముచేసి, అజీర్ణవ్యాధులను రాకుండా చేయును. ప్రతిదినము దీనిరసం త్రాగుచున్నచో అజీర్ణమును హరించును. కండ్లలో—ప్రతిదినము వేస్తూయుంటే —హాయిగా నిద్రపట్టించి, కండ్ల వ్యాధుల రాకుండాజేయును. దీనిరసం, స్వచ్ఛమైన నువ్వులనూనెతోకలిపి మరగనిచ్చి చల్లార్చి ఆనూనెను నొప్పులను నివారించును. కలరా, మశూచికములు యున్నప్పుడు యీ నిమ్మపండ్లను ఎక్కువగావాడుచూ, నిమ్మకాయరసం కల్పిన నీటినే త్రాగుతూయుంటే — కలరా మశూచికములు దరిచేరవు.

ఈ నిమ్మపండ్లరసము పది సంవత్సరముల వయస్సుకలవారు, దినమున కొకచెంచాడునూ్న, ఇరువది సంవత్సరముల వయసుగలవారు రెండు చెంచాలునూ్న, ముప్పది సంవత్సరముల వయస్సుకలవారు మూడు చెంచాలునూ్న, ఈరీతిగా హెచ్చించుచూ పోవలెను. అట్లు వాడినవారు నిరంతర యౌవనము అనుభవించుచూ, పూర్ణాయుష్మంతులై, వార్ధక్యములోగూడ నరముల పటుత్వము కల్గియుందురు. సుఖరోగులకు దివ్యామృతమువంటిది.

## ఫిన్‌లాండు జన్మదాత

# ఫీల్డుమార్షల్ మేనర్‌హీమ్

రచయిత :

కొత్తపల్లి శ్రీరామమూర్తి, యల్.యమ్.ఇ.

రష్యారంగంలో హిట్లరుకి కుడిభుజం. ఫిన్‌లాండు భాగ్యవిధాతడు మార్షల్ మేనర్‌హీమ్ శూరుడనుట అతిశయోక్తి కానేరదు. 1917 లో రష్యాలో బయలుదేరిన విప్లవజ్వాల ఆత్మ దేశంపై విరుచుకు పడకుండా కాచిరక్షించుకొన్న నిరుపమాన దేశభక్తుడు.

మేనర్‌హీమ్ దేశభక్తి, అద్వితీయ పరాక్రమము రణనీతి ఆదర్శప్రాయములు. అసదృశ ప్రతిభాశాలి. రాజకీయ దురంధరుడు. ఆపదలందుకూడా ధైర్యము చలించని ధీరుడు.

అతడు నేడు డెబ్బది అయిదేండ్ల వృద్ధుడు. గతనెల 4-వ తేదీని అతని జన్మదినోత్సవం జరిగింది. ఆసందర్భంలో హిట్లరు స్వయంగా ఫిన్‌లాండువెళ్ళి అతన్ని ఆదరపూర్వకంగా దర్శించాడు. ఆ రణనీతి విశారదుడు వృద్ధుడు అయినా ఉక్కుమనిషి అనిపేరు గాంచిన స్టాలిన్ సైన్యాలను తన ఆత్మదేశపరిసరములలో లేకుండా తరిమిన ధీరోదాత్తుడు.

1919 లో ఫిన్‌లాండు దేశమును రష్యా భల్లూకపు పట్టునుండి విడిపించి స్వతంత్రదేశంగా చేసిన మేనర్‌హీమ్ మేను ప్రాణములుండగా ఫిన్‌లాండు పరదేశమునకు లొంగుట కలలోనివార్త. మాజరిక్, మార్షల్ పిల్సుడుస్కీ, మొదలగు వీరాధివీరుల కడకాలములో ప్రాణములున్నంతకాలము జకోస్లోవాకియా, పోలెండు దేశాలపై ఎవరూ తేరిపారచూడలేక పోయినట్లే ఫిన్‌లాండులో మేనర్‌హీమ్ బ్రతికియున్నంతకాలం ఇటు జర్మనీకాని అటు రష్యాకాని దానిని లొంగదీసుకొనలేవు. అది నమలరాని నారికేళం.

ఫిన్‌లాండు దేశానికి జీవగర్ర మేనర్‌హీమ్ జీవితము కడు చిత్రమయినది. అతడు 1867 సంవత్సరం జూన్ 4-వ తేదీని విల్మాన్‌స్ట్రాండ్ నగరంలో లాహిసారీ అనే మందిరమున జన్మించాడు,

అతడు స్వీడిష్‌జాతీయుడు అయినా జన్మభూమియగు ఫిన్‌లాండు అంటే అపరిమితమైనభక్తి. జన్మతహా గొప్ప కుటుంబములో పుట్టినా ప్రజారంజకుడైన పాలకుడైనాడు మేనర్‌హీమ్.

మేనర్‌హీమ్ పూర్తిపేరు బేరన్ కారల్ గస్టఫ్ ఏమిల్‌వాన్ మేనర్‌హీమ్.

మేనర్‌హీమ్ తండ్రిపేరు కౌంట్ మేనర్‌హీమ్. తల్లిపేరు హెడ్విగ్‌వాన్‌జులిన్ ఆఫ్ ఫిసికాన్. ఆమెకు ఏడుగురు సంతానం. గస్టఫ్ మూడోవాడు. మేనర్‌హీమ్‌కి మూడేండ్లు వచ్చేవరకు మాటలు రాలేదు. మూగవాడుగా వుండేవాడు తల్లిదండ్రులకు చింతగా వుండేది. చిన్నతనంలో పంతుపట్టు పట్టి తనకు కావలసినది పొందుతూ వుండేవాడు — అతనికి ఒక చెల్లెలు పుట్టగానే ఆమెతో మాట్లాడటానికా అన్నట్టు చిలకపలుకు పలకడం ప్రారంభించాడు.

మేనర్‌హీమ్‌నుగురించి తల్లికి చాలా చింతగావుండేది చిన్నతనంలో ఇంట్లో ఎవరూ మేలుకోనిదే నిద్రనుండిలేచి పొలాల్లోకి పారిపోయేవాడు అతని నాలుగోఏట ఒకరోజల్లా అతడు పొలాల్లోతిరుగుతూ వుంటే పాలేరులు వెతికి పట్టుకుని యింటికి తీసుకువచ్చారు.

గస్టవ్ మాతృభాష స్వీడిష్ భాషకాని అతనికి ఫిన్‌లాండుభాష బాగా వచ్చును. మేనర్‌హీమ్‌తల్లి ఇంటిపనులన్నీ స్వయంగా చూ

చుకొని సాయంకాలమందు తన ఏడుగురు బిడ్డలకు కథలు చెపుతూ వుండేది. తండ్రి ఎప్పుడూ యింటి వద్ద వుండేవాడు కాదు తరచు బయట ఊరులలో వుండేవాడు కాగా తల్లియే వారి జీవితసౌధములకు పునాదివేసిన మహావ్యక్తి.

మేనర్‌హీమ్‌కి 12 ఏండ్లు రాగానే వారికుటుంబం హెలెన్‌స్కీ- చేరింది.

1881 లో మేనర్‌హీమ్ తల్లి చనిపోయింది. ఆమె చనిపోయిన మరుచటి సంవత్సరమే హామినాలోని ఫినిష్ కేడెట్టు స్కూలులో విద్యార్థిగా చేరాడు మేనర్‌హీమ్.

తల్లి మరణానంతరం అక్క సోఫియా అతని యోగక్షేమాలు చూస్తూవుండేది. అమె అంటే అతనికి అపరిమితమైన భక్తి విశ్వాసాలు. అమె తన జీవితమునంతను ఫిన్‌లాండులోని రెడ్ క్రాస్ సుసైటీకి ధారపోసి, అరువదారవ ఏట 1928 లో చనిపోయింది. ఆమె మరణము మేనర్‌హీమ్‌ను బాగా కృంగతీసింది.

పదునెనిమిదవఏట హెలెన్‌స్కీలో మెట్రిక్యులేషన్ పూర్తి చేసి సెంటు పెటర్సుబర్గు నేటి లెనెన్‌గ్రాడ్‌లోని నికోలై కేవలరీ స్కూల్లో చేరాడు.

మేనర్‌హీమ్ చక్కనివాడు. కాగా పెట్రోగ్రాడ్‌లో సైనిక శిక్షణ పొందేసమయంలో అనేక మంది స్త్రీలు అతన్ని ఆకర్షింప ప్రయత్నించి విఫలులైనారు.

మేనర్‌హీమ్ జారు ప్రభువుల అభిమానమునకు పాత్రుడైనాడు. రాజమందిరమునకు తరచు వెళుతూవుండేవాడు చిన్న గ్రాండ్ డచ్చస్ అతన్ని చూడటానికి కుతూహలపడుతూవుండేది. మేనర్‌హీమ్‌కి రాజమందిర వాతావరణ పట్టేదికాదు అతడు స్వేచ్ఛగా ఊరిబయట వుండాలని అనుకుంటూ వుండేవాడు.

ఒకసారి రాజసభయందు ఆన్ ఎస్టాసి ఎరపొవా అనే విదుషీమణి మేనర్‌హీమ్‌ను కలసికొన్నది ఆమె అతి లావణ్యవతి రష్యాలో అందమునకు పేరుపొందిన సుందరాంగి. పౌష్కిన్ పండితుని బంధువు. అప్పట్లో గస్టాఫ్‌కి యిరువదినాలుగో ఏడు. ఆమెకు పదునెనిమిదవ వర్షము. వారి మధ్య ప్రేమలత పెనవేసుకొన్నది. వారి యిరువురకు వివాహమైంది, ఆ దంపతులకు యిద్దరు కుమార్తెలు కలిగారు కుమార్తెల చదువుకొరకు మేనర్‌హీమ్ భార్య కుమార్తెలను తీసుకొని పారిస్‌నగరం వెళ్ళింది. ఫిన్‌లాండు స్వతంత్రపోరాటం ముగిసినవెనుక తిరిగి భర్తను కలసికొని వానితో వుంటూవుంది.

మేనర్‌హీమ్ 1904-5 లో జరిగిన రష్యా జపానుయుద్ధంలో పాల్గొని పేరుపొందాడు; రష్యా అధికారుల అనుజ్ఞపైన రష్యాకు ఉత్తరభాగములలోని యార్‌ఖన్‌డ మకాన్ ఎడారి. అక్సు మొదలగు ప్రాంతములను అన్నిటిని పరిశోధించాడు, చైనాదేశమంతయు వచ్చాడు. తిరిగి 1909 లో రష్యా సైనికోద్యోగిగా నియమితుడయినాడు. దేశసంచారంవల్ల అతనికి విజ్ఞానం అభివృద్ధిపొందింది. దానితో అతని ప్రతిభ హెచ్చింది.

ఆతరుణంలో రష్యన్ జారు ప్రభువులు ఫిన్‌లాండు పూర్తిగా తమలో జీర్ణంచేసుకోవాలని సంకల్పించుకొన్నారు.

ఫిన్‌లాండు జాతీయతను పూర్తిగా రూపుమాపాలని అనుకున్నారు, దానికి మేనర్‌హీమ్ గ' శత్రువు, తరుణముకొరకు వేచిన్నాడు. మేనర్‌హీమ్ దేశసంచారంలో సముపార్జించి తెచ్చినవస్తుసముదాయాన్ని హెలెన్‌స్కీలో సముద్రతీరమందున్న సుధాధవళితమైన స్వగృహమందు మ్యూజియమ్‌గా అమర్చాడు, దానితో అతని ఘనత దశదిశలు పాకింది.

మేనర్‌హీమ్‌కి ఆత్మవిశ్వాసం మెండు. ఒకసారి 1910లో రష్యా అశ్వదళములకొరకు గుఱ్ఱములను పరీక్షిస్తున్నాడు. ఒక గుఱ్ఱం అతన్ని తన్నింది. ఆ తాపుకి అతని మోకాలుచిప్ప విరిగింది. వైద్యులు ఆ కాలు తిరిగి రాదు అన్నారు కాని మేనర్‌హీమ్ వారిని బతిమాలి ఆ మోకాలుచిప్పను అతికి కట్టు కట్టించాడు, నానాపాట్లుపడి ఆ కాలును యథారీతికి తెచ్చుకొన్నాడు, డాక్టర్లు అతని ఆత్మ విశ్వాసానికి అచ్చెరువొందారు. అతడు కాలు చికిత్సపొందే రోజులలో

వ్వదాపోనీయకండా విశ్రా సేకరించాడు.

ంతకాలం పోయాక మళ్ళీ గుఱ్ఱం ఆకాలుమీదనే ంది. ఈసారి మళ్ళీ అతుక్కో రు డాక్టర్లుకాని అతని విశ్వా ముందుగా పనిచేసింది కాలు థాస్థితికివచ్చింది.

1920 లో ఉత్తర ఆఫ్రికాలో టకు వెళ్ళినప్పుడు కారు ప్రమా కంలో చట్ట విరిగిపోయింది, రెండు మంచంమీదనుండి లేవలేదు ప్రమాదావస్థలోకూడా ధైర్యం చెక్కు చెదరలేదు.

17 లో రష్యాలో విప్లవం రాగానే మేనర్‌హీమ్ అదృష్టరేఖ బయటపడింది. అతడు ప్రభుసంతతి వాడగుటవల్ల అరిస్టోక్రేటిక్ లక్షణాలు అతనిలో ప్రస్ఫుటంగా వున్నాయి. కాగా విప్లవకారులు అతనిని పట్టి బంధిస్తారన్న అనుమానంతో విప్లవం ప్రారంభింపగానే రష్యానుండి మారువేషంతో స్వదేశమునకు చేరుకున్నాడు.

మేనర్‌హీమ్ రైల్వే పోర్టరు వేషంతో రష్యానుండి ఫిన్‌లాండులోని హెవెన్‌స్కీ నగరం చేరుకున్నాడు ఆనాడు అతడు విడువకుండా తనతోకూడా తీసుకొనివచ్చిన అమూల్యవస్తువు సెంటుపీటర్సు ర్గులోని యాచట్ క్లబ్బుపై గురుతూవున్న జండా ఒక్కటే జండా తెలుపూ నీలంకలసివుంది. ఆ జండాయే నేడు ఫిన్‌లాండు దేశ స్వతంత్రచిహ్నంగా విరాజిల్లుతోంది.

1917 లో విప్లవం తీవ్రరూపం దాల్చేసరికి ఫిన్‌లాండు పరిస్థితులు విషమంగా వున్నాయి. ఈ విప్లవం వల్ల ఫిన్‌లాండు తిరిగి స్వాతంత్ర్యము పొందవచ్చునని ఉప్పొంగింది కాని దానిని ఎట్లా సాధించాలో ఎవరికీ తోచలేదు. ఫిన్‌లాండులో వున్న సైనికులు కొందరు ఉద్యోగములువదలి రష్యాపద్ధతిని విప్లవం తీసుకురావడానికి ప్రచారంచేయసాగారు ఫిన్‌లాండు ప్రజలు రష్యా విప్లవపద్ధతులకు భద్ద్రవైరులు అంతఃకలహములు వచ్చేసూచనలు కనుపించాయి, ఆతరుణంలోనే మేనర్‌హీమ్ ఫిన్‌లాండు చేరుకున్నాడు ఫిన్‌లాండులోని భూస్వాములు ప్రభువులు విప్లవం అణచే ధీరుడెవరని తహతహపడుతున్నారు. వారి కంటికి మేనర్‌హీమ్ కనుపించాడు.

వారంతా ఫిన్‌లాండుని స్వతంత్రదేశంగా చేయడానికి శక్తివంచన లేకండా సాయంచేస్తామని మేనర్‌హీమ్‌కి వాగ్దానంచేశారు. కాని తగిన సైన్యం లేకపోవడంవల్ల మేనర్‌హీమ్ కార్యం కష్టతరమయింది. కాని శూరుడు వెనుతీయలేదు. అవకాశముడు జారవిడవకుండా స్వాతంత్ర్యమునకు తహతహపడుచున్న యువకులను పోగుచేసి 1917 జనవరి 20-వ తేదీని. ఫిన్‌లాండు ఉత్తరభాగములోని వాసానగరంలో ఒక సైనికదళమును సమకూర్చుకొన్నాడు. ఆ సైనికులకు శిక్షణ అంటే ఏమిటో కూడా తెలియదు. కాని గురిచూచికొట్టడంలో స్వతహాగా ప్రవీణ్యమున్నవారగుటవల్ల ఆఫిన్‌లాండు యువకులు మేనర్‌హీమ్ కార్యమును సులభం సాధ్యం చేశారు.

ఆ యువకుల సాయంతోను జర్మన్ సైనికుల సాయంతోను విప్లవకారుల ఉధృతాన్ని అరికట్టి ఫిన్‌లాండునకు స్వేచ్ఛను సముపార్జించాడు ఆనాడు.

అతడు ధీరోదాత్తుడగు నాయకుడేకాక రణవ్యూహములు పన్నడంలో గొప్ప మేధావి. అట్టి అసమాన ప్రజ్ఞకలవాడగుట వల్లనే కొద్దిపాటి సైన్యముతో అనాడు రష్యాసైన్యాలను ముప్పు తిప్పలు పెట్టాడు. ఈనాడు పెట్టిస్తున్నాడు. మేనర్‌హీమ్ వైటార్మీకి 'సిసీ' అని పేరు. అంటే తుపాకీ వేటలో ఆరితేరినవారని అర్థము.

సాధారణంగా మేనర్‌హీమ్ యుద్ధపద్ధతి ఈలావుంటుంది. అతడు సైన్యమును మూడు భాగాలుగాచేసి ఒక భాగమును శత్రువుతో ఢీకొలిపి మిగతా రెండు భాగములను రెండు ప్రక్కలనుంచి శత్రువును చుట్టుముట్టునట్లు చేస్తాడు. శత్రువులు రెండువైపులా పోరాడలేక లొంగిపోతారు.

నేడు మేనర్‌హీమ్ చేతిలో పూర్వంకన్నా ఆరితేరిన సైనికులు అధిక సంఖ్యాకులు వున్నారు. అందుచేతనే 1939 లో జరి

గిన రష్యా ఫిన్‌లాండు యుద్ధంలో విజయం పొందాడు.

మేనర్‌హీమ్ శక్తిసామర్థ్యమే కాక ఆదేశంయొక్క భౌతిక పరిస్థితులుకూడా అతనికి తోడ్పడ్డాయనక తప్పదు.

అతడు నేడు ఫిన్‌లాండ్‌కి ముకుటములేని రాజు.

అతడు భార్యతో సహా యిప్పుడు హెలెన్‌స్కీలో తన సొంత భవనంలో నివసిస్తున్నాడు. అతడు నేడు డెబ్బదిఅయిదేండ్ల వృద్ధు అయినా వార్ధక్యలక్షణాలు అతనిలో కనుపింపవు యువకుని మాదిరి చలాకీగా పనిచేస్తాడు. శ్రమ ఎరుగనిజీవి.

మేనర్‌హీమ్ భోజనప్రియుడు. తరచు విందులు చేస్తూవుంటాడు. రాజకీయాలు అతని బుర్రకి ఎక్కవు. ఆపాదమస్తకము అతడొక నిరంకుశ ప్రభువు డిమక్రసీ అనేది వట్టి బూటకపు మాటఅని నమ్మేవారిలో యితడొకడు. కాని అతనిని ఫిన్‌లాండు ప్రజలు తమ ఏకైక నాయకుడని పూజిస్తారు. ప్రజాహృదయమును చూరగొన్న శూరుడు మేనర్‌హీమ్.

1920 లో ఫిన్‌లాండు బాలబాలికల యోగక్షేమం చూచుటకొక సంఘము నెలకొల్పాడు. పిల్లలన్నా జంతువులన్నా ప్రేమ.

1933 లో ఫిన్‌లాండు ప్రభుత్వము ఫీల్డుమార్షల్ అనే బిరుదమును ప్రసాదించింది మేనరహీమ్‌కి ఆదేశంలో ఆబిరుదము పొందడానికి యితడే ప్రథముడు.

1940 లో ఫిన్‌లాండ్ మేనర్‌హీమ్ దేశసేవకు మెచ్చుకొని వజ్రములతో పొదగబడిన ఫినిష్‌క్రాస్ అఫ్ లిబరిటీని అతనికి బహూకరించింది.

ఆ అపూర్వమేధాశక్తి సంపన్నుడు గొప్ప డిసిప్లినేరియన్ ఉదయం ఆరుగంటలకు నిద్రలేస్తాడు. నిద్రలేవగానే వ్యాయామంచేస్తాడు ఆడంబరజీవితం డాంబికము అతనికి నచ్చవు. పదిమందితో కలిసిమెలసివుండటంకూడా అతనికి యిష్టముండదు. సంభాషణ ప్రియుడు కాదు కాని అయిదుభాషలలో చక్కని పాండిత్యమున్నది. హెలెన్‌స్కీలో అతని మందిరము సముద్రతీరమునకు సమీపమున కొండవాలునందువుంది. అతనికి ఒక కారు యిద్దరు కార్యదర్శులు మాత్రమే వున్నారు.

గుఱ్ఱపుస్వారీ అంటే అపరిమితమైన ఆనందం, వేట అతనికి ఒక వినోద క్రీడ. ఆవేటకొరకు హిందూదేశం ఆఫ్రికా మొదలగు దేశాలు తరచు వెడుతూవుండేవాడు గుఱ్ఱపుపందాలు చూడటానికి ఇంగ్లండు వెళుతూవుండేవాడు ఒక నిముషంకూడా వుచ్చడు. అతడు రాత్రులంగా పదకొండు గంటలకు తపుకాటుమీద నిద్రపోతా కాంపుకాటుని తన బాల్యము కూడా వుంచుకుంటున్నాడు అంటే అతనికి ప్రీతి మెండు.

1939 లో రష్యా యు ప్రకటించింది ఫిన్‌లాండుపై.

ఒక్క జర్మనీతక్క మిగి ప్రభుత్వాలన్నీ అతనికి సాన చూపాయి. మొత్తంమీ దేశ మర్యాదను నిలబెట్ట డు. తుదకు నేడు జర్మనీతలుకలపి రష్యాతో పోరాడు డు. ఏయే దేశాలు ఆనాడు న్ని కొనియాడినవో ఆయాదేశా ం నేడు మేనర్‌హీమ్‌ను కంటగి ుకుంటున్నాయి. అది కాలమహి గాని వేరొండు కాదు.

మేనర్‌హీమ్ యింగ్లీషుభాక్షుణ్ణంగా మాట్లాడతాడు అత యింగ్లీషులో అనే గ్రంథం వ్రాశాడు.

ఈ శూరుడు నేడు హిట్లరుతో ఏకీభవించుటవల్ల మిత్రమండలికి విరోధికాని లేనిచో రణవిశారద ములో అందరికీ పూజనీయుడు. లూడెండార్ఫ్, ఫాచ్, హేగ్ మొ లగు రణశూరులతో సరితూ ప్రతిభాశాలి మేనర్‌హీమ్.

Printed at the Andhrabhumi Printing Works, 13 Mukhatal Street. Vepery P.O, Madras
Editor & Publisher : Andra Seshagiri Rao B.A.